మహాకవి

# యజ్ఞఫలము

[నాటకము]



(సీతాకల్యాణపర్యంతము
రామగాథ)



అనువాదకులు :

విద్వాన్, శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ.,

ఆంధ్రపండితులు, పి. ఆర్. కాలేజి, కాకినాడ.

# అంకితము

శ్రీరమ్యగురువరేణ్యాప
దారాధ్యతత్త్వరత్న మవ్యయకరుణా
పారంగత తద్విజ్ఞా
శ్రీరమ్యత నాకు సకలసిద్ధులు నిడుతన్ !

గురువరా ! త్వత్కృపామృతభరితమౌను
కీనకావ్యసుమంబు లంకిత మొనర్తు
జన్మమృత్యుజరావ్యాఘ్రజంతువితతి
నాశనము చేసి యవ్యయానంద మంద.

నీపాదకమలసేవా
వ్యాపారమహాసుఖంబు సందు మఱఁగి నాం
ఛాపూర్ణసిద్ధి సంపద
నాపుణ్యకృతిప్రసిద్ధనవకన్య లహో !

పరుసవేదిని సోఁకినవస్తువు లవి
మెఱుఁగు హేమంబునన్ స్వర్ణమయము లగును
భవ్యభవదీయచరణసంస్పర్శ కలుగ
కృతిలతాంగియు సౌభాగ్యవతి తలంప.

పలుపలుకు లేల ? గురువర
లలితపదాంభోజయుగళి లగ్నం బయి మ
త్సలలితమానసబంభర
మలసోఁకగ బ్రహ్మపదము సందునుగాతన్ !

# ఇందలి పాత్రలు

| | | |
|---|---|---|
| సూత్రధారుఁడు | | నటి |
| సుమంత్రుఁడు | | విజయ |
| కాంచుకీయుఁడు | దశరథుఁడు (రాజు) | చేటి |
| విదూషకుఁడు | విశ్వామిత్రుఁడు | మంథర |
| చిత్రకేతుఁడు } గంధర్వులు | | కౌసల్య } రాణులు |
| చిత్రపదుఁడు } గంధర్వులు | | కైకేయి } రాణులు |
| రావణుఁడు | వసిష్ఠుఁడు | సుమిత్ర } రాణులు |
| మాళవకుఁడు } వైతాళికులు | రాముఁడు } కుమారులు | మధురిక } సీత చెలికత్తెలు |
| భషకుఁడు } వైతాళికులు | భరతుఁడు } కుమారులు | చతురిక } సీత చెలికత్తెలు |
| దంతిలుఁడు } వైతాళికులు | లక్ష్మణుఁడు } కుమారులు | పుష్పలతిక } సీత చెలికత్తెలు |
| గోపిలుఁడు } వైతాళికులు | శత్రుఘ్నుఁడు } కుమారులు | చంద్రకళ } సీత చెలికత్తెలు |
| దేవతలు | జనకుఁడు | సీత } వధువులు |
| గంధర్వులు | పరశురాముఁడు | మాండవి } వధువులు |
| రాక్షసులు | | ఊర్మిళ } వధువులు |
| | | శ్రుతకీర్తి } వధువులు |



 

# అవతారిక



భాసమహాకవి ఇరువదిమూఁడునాటకములకుఁ దక్కువ కాకుండ వ్రాసియుండవలయు ననియు, 'కిరణావళి' 'ముకుటతాడితకము' 'ఉదాత్తరాఘవము' మున్నగునామములు గలభాస నాటకము లింకను మనకు లభింపవలసియున్న వనియు శ్రీ. ఆర్ వి కృష్ణమాచారిగారు తమ ప్రియదర్శికాభూమికలో వ్రాసియున్నారు. * ఇట్లే భాసుఁడు ముప్పదినాటకములవఱకు వ్రాసియుండవలయు నని మఱి యిద్దఱు విమర్శకులు పేర్కొనియుండిరి. ఏది యెట్లున్నను, అలంకార గ్రంథములలో నుదాహృతములైన శ్లోకములు కొన్ని ప్రస్తుతము మనము భాసనాటకములుగాఁ బరిగణించు పదుమూఁడు నాటకములలోను గానరాకపోవుటవలన భాసుఁ డింకను గొన్నినాటకములు వ్రాసియుండవలయు ననియుఁ గాలగర్భమున నవి లీనమై యుండు ననియు ననుకొనుటకు వీలు చిక్కుచున్నది. ఈ యవకాశమును బురస్కరించుకొని యిటీవల వెలువడిన "యజ్ఞఫల" మను సంస్కృతనాటకము భాసమహాకవి రచించి యుండినినాటకములలో నొకటి యని తెలియుచున్నది.

## యజ్ఞఫలము : గ్రంథప్రకాశము

కథియవాడు రాష్ట్రమునకుఁ జెందిన గోండలు నగరము నుండి రాజవైద్య జీవరామ కాళిదాసశాస్త్రిగారు 'యజ్ఞఫల'

* ప్రియదర్శికా భూమిక. పుట. XXXIII. వి. వి. ప్రెస్సు. శ్రీరంగము. 1909 సంవత్సరమున ముద్రితమైన ప్రతి.

మను నాటకమునకు సుమారు మూఁడువందల సంవత్సరములకు వెనుకటివైన రెండు ప్రాచీనపు వ్రాఁతప్రతులను సంపాదించిరి. వాని ననుసరించి 'యజ్ఞఫలము' ను ప్రకటించి తమయుపోద్ఘాతములో "అతిప్రాచీనసంస్కృతభాష ననుసరించియు, వస్తుకల్పనమునఁ గల శ్రేష్ఠతనుబట్టియు, రసభావాలంకార నాట్యాంగ మనోహరత్వమును బురస్కరించుకొనియు, భాసనాటక సామాన్య లక్షణము లని బాణాదులు చెప్పుచున్న యనేక విషయములకీ నాటకము నిధానమగుటంబట్టియు నిది తప్పక భాసనాటకములలో నొకటి యని నా దృఢ విశ్వాసము" అని వారు వ్రాసియున్నారు. ఆ పిమ్మట, వెనుకటి పదుమూఁడు నాటకములు భాసునివి 'కా' వని కొందఱు 'ఔ' నని కొందఱు వాదించుచు వచ్చుచున్నట్లే 'యజ్ఞఫలము' కూడ భాసునిదే యని కొందఱు కా దని కొందఱు పత్రికలలో తర్జనభర్జనలు కావించియున్నారు. †

ఈ పరిస్థితిలో బొంబాయి భారతీయవిద్యాభవనస్తంభములలో నొకరనఁదగిన డాక్టరు ఏ. డి. పుసల్కరు ఎం. ఏ; పి హెచ్. డి; బెంగుళూరు సంస్కృత సారస్వతసమితికిఁ ప్రాణ మనఁదగిన శ్రీ ప్రొఫెసరు యస్. యల్. సింహ ఎం. ఏ, మున్నగువారు సునిశితవిమర్శన మొనరించి యుక్తియుక్తముగా 'యజ్ఞఫలము' భాసకృతమే యనుటకు సంశయింపఁ బని లేదని

---

† శ్రీవేంకటేశ్వర ప్రాచ్యవిద్యాసంస్థ పత్రిక. సంపుటము 11 సంచిక 2. జూలై-డిసెంబరు 1941 పుట. 473. *Quarterly Journal of the Mythic Society.* సం. XXXII. సంచిక 4. పుట 441. *Hindu Literary Supplement* 15-2-1942.

తమ గ్రంథములలోఁ దెలిపియున్నారు. ‡ వారు చూపిన హేతువాదమును బరిశీలించుటకుఁ బూర్వము స్థాలీపులాకన్యాయమున యజ్ఞఫలనామౌచిత్యము, నాటకకథావిధానము తెలిసికొనుట యత్యావశ్యకము. వీనివలననే కొంతకుఁ గొంతయైనను ఈ నాటకము భాసమహాకవి కృతమే యని తెలియకమానదు.

## నా మౌ చి త్య ము

ఈనాటకమున యజ్ఞఫల మనుమాట ఐదాఱు పర్యాయములు వచ్చుటయే కాక దశరథునియజ్ఞఫలముగా శ్రీరామావతారము, విశ్వామిత్రుని యజ్ఞఫలముగా శ్రీరామాస్త్రపరిగ్రహణము, జనకుని యజ్ఞఫలముగా శ్రీ సీతారామకల్యాణము ఈ నాటకమున వస్తువులగుట ఈ నాటకమున కీ నామము చాల నుచితముగా నున్నది. సుగ్రీవ విభీషణ రామపట్టాభిషేకములు కథావస్తువులుగాఁ గల నాటకమునకు "అభిషేకనాటక" మని పేరిడిన భాసుఁడు 'యజ్ఞఫల' మను నామ మీ నాటకమున కిడియుండుట చాల సమంజస మని తోఁపకమానదు.

## కథావస్తువు — ప్రథమాంకము

ఇందు దశరథుని యజ్ఞఫలముగా రామాదు లవతరించుటయు, వారిబాల్యము కడచుచుండుటయు, వారిజన్మదినోత్సవము దశరథమహారాజు జరపుచుండుటయు, దశరథుని హృదయ మెఱిఁగి సుమంత్రుఁడు రాజ్యమునఁ గల సర్వప్రజలను వాంఛితార్థములచే సంతోషపెట్టుటయు, అటఁపిమ్మట కారాగృహ

---

‡ *1. Bhasa. by Dr. A. D. Pusalker* పుట *135-142*

*2. Pancharatra. Edited and Published by S. N. Simha. M. A. Bangalore.*

బద్ధుల నెల్లర విడిచిపుచ్చు మనియు సర్వజనులను సర్వదాన సత్కారములచే సంతోషపెట్టు మనియు రాజాజ్ఞ యగుట కంచుకి తెలుప సుమంత్రుఁ డప్పటి కప్పుడే యాపని నొనరించియుంటి నని తెలుపుట, రాజు తనపైఁ బడ్డ గురుతర బాధ్యతలకు, పుత్త్రుల నెట్లు శస్త్రాస్త్ర సర్వవిద్యాపారంగతులఁ గావింపఁగలుగుదునో యనియు జెంగపెట్టుకొనుట, వసిష్ఠమహర్షికి విద్యార్థులనుగా వారి నొప్పగించుట, రాజు సుమంత్రునితోఁ దన గురుతర బాధ్యతలను గూర్చియు రామపట్టాభిషేక ప్రతిబంధక మగు కైక వరమును గూర్చియు ముచ్చటించుట, ఇంతలో రాణులు ముగ్వురు నెవరికి వారే ముందు తమకు దర్శనమిప్పింపు మని రాజునకు విన్నపము లంపుకొనుట, రాజు ముగ్వురను సమముగా గౌరవింతు నని ప్రతివచన మిచ్చి గ్రీష్మోద్యానమునకు రమ్మని వార్త లంపుట, ఇంతలో సూర్యాస్తమయమగుట, రాజు విదూషకునితో వెడలుటయు జరుగును. ఈ యంకము మొదటనే విదూషక కాంచుకీయ సంభాషణము భాసుని హాస్యరస చమత్కృతులకు నిదర్శనముగా వెలయుచున్నది.

## ద్వితీయాంకము

ఇందు రాజు పరివారముతో గ్రీష్మోద్యానమునఁ బ్రవేశించుట, సుమంత్రుని బిలిచి రాముని యౌవరాజ్యాభిషేకమునకనుకూలముగా సర్వజనులను రామమానసులనుగను భరతుని రామభక్తునిగను జేయుచుండు మనుట, ఇంతలో రాణులు రాఁగా సుమంత్రుఁడు వెడలిపోవుట, రాజు రాణులతోడి సంభాషణమున అభిషేకప్రశంస తెచ్చుట, దాయభాగవిచారము, సుమిత్రరామ భక్తి, కైకేయి సౌశీల్యముతో రాముని కే రాజ్యమీఁ దగు

ననుట, కౌసల్యా రామానురక్తి, సుమిత్రాకైకేయీసౌశీల్య ప్రదర్శనము, దశరథుఁ డమితానంద మందుట, రాణులనిష్క్రమణము, దశరథుఁడు సుమంత్రుని బిలిచి వసిష్ఠాదేశప్రకారము తనపుత్త్రులను రాజనీతి శాసనవిధాతలఁ జేసి యనుగ్రహింపుఁడని విన్నపమంపుట, ఇంతలో రామకీర్తి విని రావణుఁ డయోధ్యా నగరమున ననిష్టమాచరింపఁ దిరోహితుఁడై తిరుగుచుండె నన్న వార్త విని రాజు ప్రతీకారచర్యలఁ గైకొన నేఁగుట జరుగును.

## తృతీయాంకము

ఈ యంకమున విష్కంభములో నింద్రుఁ డిరువురుగంధర్వులను రావణునివలన రామున కేయపాయము కలుగకుండు నట్లు చూచుటకుఁ బంపుట తెలియనగును. తరువాత రావణ విశ్వామిత్రులు మాయారూపులై తిరోహితులుగ వచ్చుట, వారొకరినొకరు కనుఁగొనఁగలిగియు నితరుల కగపడకుండుటయు రావణుఁడు రాము నెత్తుకొనిపోవుటకు, విశ్వామిత్రుఁ డాతనిని శిష్యునిగాఁ గైకొని దివ్యాస్త్రముల నుపదేశింపఁ గైకొనిపోవుటకు వచ్చినట్లు తెలియును. ఇంతలో రాజకుమారులతో వసిష్ఠుఁ డరుదెంచి నాఁ డనధ్యాయమగుట రాజకుమారులను వారి వారి ధనుర్విద్యాకౌశలముఁ బరీక్షించుకొన ననుమతించి వెడలి పోవుట, కొంత దవ్వేఁగి రాజకుమారులలో భరత లక్ష్మణ శత్రుఘ్నులు తమతమ ధనుర్విద్యానిపుణతఁ జూపుట, వారు రాముని విద్యానిపుణతఁ జూప బలవంతపెట్టుట, రాముఁడు రెండుసారులు బాణములు విడుచుట, వానిని దారిలో మాయాశరీరులై యున్న రావణవిశ్వామిత్రులు త్రుంచివేయుట, రాముఁడు కోపించి యాగ్నేయాస్త్రము ననుసంధించుట, రావణుఁ డది చూచి

భీతుఁడై పాఱిపోవుట, ఆతఁ జేయుకర్మమును జేయకుండునట్లు జూచుటకు విశ్వామిత్రుఁ డాతని ననుసరించిపోవుట, ఇంతలో రాణుల చెలికత్తెలు దూరమునఁ గనఁబడ వారికిఁ దగులు నను భీతిచే రాముఁడు బాణము విడువకుండుట, రావణుని రథపు గుఱ్ఱలు కాంచి చెలికత్తెలు సీతావహృతలై పాఱిపోవుట, రాముఁడు బాణము విడువఁజూచుచుండ వసిష్ఠమహర్షి యేతెంచి వారికి రావణ విశ్వామిత్రుల యాగమన విశేషములం జెప్పి మఱు నాఁడు విశ్వామిత్రుఁ డటకు రానున్నాఁ డనియు వచ్చినపుడు నమస్కారపురస్సరముగా గౌరవింపుఁ డనియుఁ జెప్పి వెడలుట, రాజకుమారు లింటి కేఁగుట, మంథర దుర్మంత్రణము, సుమంత్రుఁడు వచ్చి రావణ విశ్వామిత్రాగమనవార్త విని కావలి వారలను హెచ్చరింప నేఁగుట జరుగును.

## చతుర్థాంకము

ఈ యంకమునకుఁ దొలుత నలువురు కావలివారి హాస్య సంభాషణము, విదూషకుని రాకతో నది యధికమగుట, విశ్వామిత్రునిగుఱించి వారు వికటముగాఁ జెప్పుకొనుట జరుగును. పిదప విశ్వామిత్రుఁడు దశరథునికొలువుకూటమున కేతెంచి గౌరవింపఁబడి రాజకుమారులను వసిష్ఠు ననుమతిఁ బరీక్షించుట, పరీక్షాసమయమున రాజకుమారులకు జృంభకాస్త్రబ్రహ్మాస్త్రములు తెలియవని తెలిసికొని రాక్షసవధనిమిత్తము రాముని దనతోఁ బంపుమని దశరథు నడుగుట, దశరథుని సంకోచము, వసిష్ఠు ననుమతిని దశరథుఁడు తన పుత్త్రులు త్వరలో దివ్యాస్త్రాస్వాతులై తిరిగి తన కడకు వచ్చెద రని విశ్వామిత్రుఁడు మాట నొసఁగ నాతనితోఁ దన పుత్త్రులను బంప నిచ్చగించుట, విశ్వా

మిత్రుఁడు రామలక్ష్మణులను మఱునాఁడుదయము తనయాశ్రమమునకుఁ దీసికొనిపో నిశ్చయించుకొని విశ్రమించుట జరుగును.

## పం చ మాం క ము

ఇందలి విష్కంభమువలన రామలక్ష్మణ సాహాయ్యమున విశ్వామిత్రునియజ్ఞము పూర్తియగుట, మారీచసుబాహుల పతనమువలన నారణ్యజనులు సుఖించుటయుఁ దెలియును. అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁ డరుదెంచి రాముని గొనియాడుట, రామలక్ష్మణుల వినయప్రదర్శనము, రామరావణభవిష్యద్యుద్ధమున రామవిజయము విశ్వామిత్రుఁడు సూచించుట, రామలక్ష్మణు లారణ్యప్రకృతిరామణీయకమునకు సమ్మోహితులగుట, విశ్వామిత్రుఁడు వారికి గ్రామజీవనసౌభాగ్యముఁ జూపుట, రామలక్ష్మణులు వృద్ధగోపాలస్త్రీతో సంభాషించి గ్రామజీవనాకృత్రిమత, గ్రామజనపవిత్రతఁ దెలిసికొనుట, విశ్వామిత్రాదేశమున జనకుని యజ్ఞమునకు విశ్వామిత్రునితో రామలక్ష్మణు లేఁగుట కంగీకరించుట యిందుఁ గలవు.

## ష ష్ఠాం క ము

విష్కంభమున విశ్వామిత్రపరిచర్యకు నియుక్తులైన ముగ్గురుభటులు తమ సంభాషణలో రామలక్ష్మణుల సౌందర్యవర్ణనము, రాము నుద్యానమున నెంటరిగాఁ జూచిన సీత యాతని ప్రేమించుటయు, రాముఁడు సీతపై మక్కువగొనుటయు మనకుఁ దెలుపుదురు. పిదప, ప్రేమావేశచిత్తుఁ డగు రాముఁడు ప్రవేశించి సీతాసక్తమనస్సును నిగ్రహించుకొన యత్నించుట, ఇంతలో సీత చెలికత్తెలతో మసలఁ గానవగుట, సీత చెలికత్తెల

సంభాషణమున సీత రామపరవశయై యున్నదని రాముఁడు గ్రహించి సంతసించుట, సీత మూర్ఛవోఁగా రాముఁడు సమీపించుట, చెలికత్తె లానందించి సీతను దేర్చుట, సీతను బెండ్లాడ గోరువాఁడు శివధనుర్భంగము గావింపవలె నన్న జనకుని శపథము విషయము, రాముఁ డందులకు సమర్థుఁడే యని చెలికత్తె లెఱుంగుట, ఇంతలో జనకమహారాజే తెంచుట యెఱిఁగి రాముఁడు నిష్క్రమించుట, నిర్లిప్తుఁ డగుజనకమహర్షి సీతతో మాటాడుట, ఆమెకు జరుగఁబోవువివాహముసంగతి తెల్పి విశ్వామిత్రుని గౌరవింప నేఁగుట యిందుఁ గలవు.

## సప్తమాంకము

నిర్వాహాంక మను పేరుగల యేడవ యంకమున జనకచక్రవర్తి సత్రాంత మగుటయు, జనకుఁ డిదివఱకే దశరథాదుల భార్యాసహితుల రప్పించుట, కర్మధర్మములను గుఱించిన జనకుని మనోహరసంభాషణము, శివధనుర్భంగమును గావించిన రామునికి సీత నిచ్చితి ననియు దాని నేకగ్రీవముగా నంద ఱంగీకరించినది లేనిది తెల్పుఁ డనుటయు, సర్వప్రజలు నేకగ్రీవామోదమును దెలుపుటయు, వసిష్ఠ విశ్వామిత్ర శతానందమహర్షులు సీతారామకల్యాణమునకు దమయానందమును వెల్లడించుటయు, ఇంతలోఁ గ్రుద్ధుఁ డగుపరశురాముఁ డేతెంచుట, రామాదులు దశరథ జనకాదులు నాతనికి నమస్కరింప నాతఁడు శాంతించి శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము తనధనువు రామునికిచ్చి యాశీర్వదించి తాను దపోజీవనమున బ్రహ్మస్వరూపుఁడగుట, దేవతలు పుష్పవృష్టితో వధూవరు లగు సీతారాములను, ఊర్మిళాలక్ష్మణులను, మాండవీభరతులను, శ్రుతకీర్తి

శత్రుఘ్నులను ఆశీర్వదించుట, రాజసింహుఁ డగు రాజు పాలింప వర్ణాశ్రమ ధర్మరక్షణము సర్వశుభములు కలుగుఁగాక యను భరతవాక్యము గలవు.

యజ్ఞఫలము భాసనాటకమే

ఈ నాటకము భాసునిదే యనుటకు శ్రీ పుసల్కరు మున్నగువారు తెలిపిన హేతువాదము పేర్కొందును. ఈ కథావస్తువు భాసుని యితరనాటకములతోడి సాజాత్యము నంది యున్నది. ఇందలి నాంది శ్లోకము :

"శ్లో. రామః కృపాయా భరతో మనోజ్ఞః
పాయా త్స్వచాప శృఖలక్ష్మణశ్చ
శత్రుఘ్న వీరో మునిమన్యు రక్షీ
సదా రసోత్సాహవపుః ప్రసన్నః.

ఇది యితర భాసనాటకములందలి నాందీ శ్లోకముల వలెనే ముద్రాలంకార సంయుతము. ఇందు ముఖ్యనాటక పాత్రములు చక్కఁగా సూచింపఁబడుటే కాక రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు ప్రసన్నులై మిమ్ము రక్షింతురుగాక యనియు, కృపా భరితుఁడు, శుభ లక్ష్మణుఁడు, శత్రుఘ్నవీరుఁడు నగు రాముఁడు మిమ్ము రక్షించుఁగాక యనియుఁ జక్కని శ్లేషార్థములిందుఁ బొందుపఱుపఁబడినవి. ఇట్లే పాత్రల నన్నిటిని సూచించు పంచరాత్ర నాందితో నిది సాజాత్యము నందియున్నది.

"శ్లో. ద్రోణఃపృథివ్యర్జున భీమదూతో
యః కర్ణధారః శకునీశ్వరస్య
దుర్యోధనో భీష్మ యుధిష్ఠిరస్స
పాయా ద్విరా డుత్తరగోభిమన్యుః."

యజ్ఞఫలమునందలిస్థాపన భాసునియితరనాటకములందలి

స్థాపనలవలెనే సంక్షేపముగా నున్నది. అంతేకాక భాసునికిఁ బ్రియతమ మగు ప్రయోగాతిశయపద్ధతియే యీ ప్రస్తావనమునఁ గానన గుచున్నది.

ఇంతేకాక, 'నిష్క్రమ్య ప్రవిశ్య' మున్నగు శ్రీఘ్రనిష్క్ర మణ శ్రీఘ్రప్రవేశములను సూచించుపదములు భాసనాటకము లన్నిటఁ గలయట్లే యిందును గలవు. '(కర్ణే) ఏవమివ' మున్నగు మాటలు స్వప్నవాసవదత్తమునను యజ్ఞఫలమునను గలవు. ప్రతిజ్ఞాయౌగంధరాయణ చారుదత్తములలో ఈరీతిప్రయో గము లధికముగాఁ గలవు. 'ఏవ మవిజ్ఞాతాని దైవతాన్యభి భూయంతే' అని యజ్ఞఫలమునఁ గలదు. స్వప్నవాసవదత్తము నను నిట్లే కలదు. రాజ్యము భారవహ మని అవిమారకమునను రాజు 'స్వచ్ఛందతాభారవాహీ' అని ప్రతిమానాటకమునను గలదు. ఈభావమే యజ్ఞఫలమునను గలదు. ఇవి కాక ద్వీపకేసరుల తోడి యుపమానములు, నైతికధర్మగౌరవము, వయశ్శౌర్య ములకు సంబంధములేదన్నభావము, భాసుని యితరనాటకము లలో నున్నట్లే యజ్ఞఫలమునను గలవు.

యజ్ఞఫలమునఁ జేర్పఁబడిన ఆశ్రమ వర్ణనము, సాయంకాల వర్ణనము, గ్రామజీవన వర్ణనము మున్నగున వెల్ల భాసుని స్వప్నవాసవదత్తమునను పంచరాత్రమునను అవిమా రక బాలచరితములలోను ఆయాయీ వర్ణనములతోడి మిక్కిలి సాదృశ్యమును గలిగి యున్నవి. యజ్ఞఫలమునఁ గల రాముని మదనావస్థ సరిగా నట్లే అవిమారకమున ద్వితీయాంకమునందుఁ గానన గుచున్నది.

మఱియు, భాసుఁడు తఱచు శ్లోకము రెండుపాదము

లోకరిచేతను మిగిలిన రెండుపాదము లింకొకరిచేతను జెప్పించుట. ఈ విషయమునకు యజ్ఞఫలమునఁ బెక్కు లుదాహరణములు కలవు. (ii. 29; iii 21, 23, 24, iv. 29) ప్రతీహారి పేరు విజయ యనియే భాసనాటకములన్నిటఁ గలదు. ఇట్లే యజ్ఞఫలమునను గలదు. సాధారణముగా భాసుఁడు విష్కంభమును ఇరువురు, మువ్వురు, నలువురు వ్యక్తులతో నడపును. ఇట్లే యజ్ఞఫలమున ఇరువురు గంధర్వులు, మువ్వురు భటులు, నలువురు కావలివారు ఆయావిష్కంభములలోఁ బాల్గొందురు. బాణుఁడు భాసుని గుఱించి చెప్పిన :

"సూత్రధార కృతారంభైః, నాటకై ర్బహు భూమికైః
సపతాకైర్యశోలేభే, భాసో దేవకులైరివ."

అనుభావమునకుఁ దగినట్లు యజ్ఞఫలమున నెన్నియో నిదర్శనములు గలవు. యజ్ఞఫలము సూత్రధారకృతారంభము కలదే. ఇందు బహుపాత్రములే కలవు. ఆపాత్రములు వేఱు వేఱు జీవితదృక్పథములకే చెందినవి. ఇందు బహు పతాకాస్థానములు నున్నవి. దశరథ మహారాజు రాణులతో జరిపిన సమావేశము, రావణుఁడు రామాస్త్రములను దిరోహితుఁడై నను మనే ఖండించుట, విశ్వామిత్రుని యజ్ఞము మున్నగున వింటుల కుదాహరణములు.

ఇది కాక, "భాసో హాసః" అన్న జయదేవమహాకవి వాక్యము యజ్ఞఫలమున విదూషకముఖమునను కావలివారల సంభాషణ మూలమునను సత్యమని ధ్రువపడుచున్నది. 'యజ్ఞఫల' మతిపురాతన నాటక మని యుం దుదాహరింపఁబడిన ప్రాచీన శాస్త్రగ్రంథములను బట్టియు, నందు నానాముల సువర్ణము

లనునామ ముండియుండుటఁ బట్టియు మనకుఁ దేటతెల్ల మగు చున్నది.

మఱియు, యజ్ఞఫల'మునఁ గల సలలితమైనభాషయు, స్వచ్ఛములైన యుపమానములును, సరళమైన పదములును నిది భాసకృతమే యనుటకు సాక్ష్యములు. భాసుఁ డన్నఁ బరమ గౌరవము కలకాళిదాసు భాసుని భావముల నెన్నిటినో కైకొన్నటులు దృష్టాంతము లున్నవి. అట్లే యజ్ఞఫలము నుండియుఁ బెక్కులు చూపవచ్చును. వీనిని ద్రిప్పి కొందఱు విమర్శకులు కాళిదాసు ననుసరించిన యొకకవి యెవఁడో యీ నాటకము వ్రాసియుండవచ్చు ననుచున్నారు. వైతండికుఁడు హేతువాదమున కొప్పుకొనఁడని యజ్ఞఫలమున భాసుఁడు చెప్పినమాట అసత్యము కాదు కదా!

భాసనాటకములనుబట్టి భాసుని ప్రధాన గుణము లని యేవి నిర్ణయింపఁబడినవో అవి యజ్ఞఫలమునఁ గలవని పై విమర్శకు లిట్లు ధ్రువపఱిచిరి. అందుచే యజ్ఞఫలమునకుఁ గ్రొత్త వ్రాఁతప్రతు లేమైన లభించి యందు నాటకకర్తనామాదికము స్పష్టముగా గోచరించి యీ యజ్ఞఫల మన్యకర్తృక మని నిరూపించువఱకు నిది భాసకృతముగనే యెన్న నగును.

## యజ్ఞఫలము; భాసుని ప్రతిభాదికము

భాసుని యితరనాటకములందువలెనే యజ్ఞఫలమునను ఆతని ప్రతిభావిశేషములు లెక్కకు మిక్కిలిగా గాననగు చున్నవి. ఇందు ముఖ్యముగా భాసుని పాత్రపోషణావైశిష్ట్యము నిరుపమాన మైనది. ఆతని పద్యప్రియత్వమున కీ నాటకమును నిదర్శనమే యగును. అలంకార సంపద, సుభాషితావళి, ఆయా

పాత్రల సంభాషణాచాతుర్యము, హాస్యరస పోషణము, శృంగారరస విశిష్ట పరిపోషణము, కరుణరసపోషణము, శాంత రసపుష్టి, వీరి భయానక బీభత్సరసముల కొసఁగిన స్థానము, అద్భుతరస నిర్వాహణము— ముఖ్యములగు నీపట్టులలో భాసుని నిరుపమప్రతిభావిశేషములు చక్కఁగాఁ బొడకట్టుచున్నవి.

## పాత్రపోషణ వైశిష్ట్యము

దశరథ శ్రీరామ పరశురామ వసిష్ఠ విశ్వామిత్రాది ప్రధాన పాత్రల పోషణము నెంత యద్భుతముగా భాసుఁ డిందుఁ జూపినాఁడో అంత యద్భుతముగానే సామాన్యపాత్ర లగు సుమంత్రుఁడు మంథర మున్నగు పాత్రములవిషయమునను జూపినాఁడు. సుమంత్రుఁడు మహారాజు హృదయము నెఱిఁగి యాతఁ డాజ్ఞాపించుటకుఁ బూర్వమే సర్వజనములను సర్వసత్కారపరంపరలచే సంతోషపెట్టిన సన్మంత్రిసత్తముఁడు.

ఈతఁడు వ్యక్తప్రసంగములలోఁ గాని అతిప్రసంగమునఁ గాని పాల్గొననొల్లని యథోచిత కార్యప్రవర్తకుఁడు. "వైతండికుఁడు హేతువాదమున కొప్పుకొనఁడు. ఈతనితో మనకుఁ బని యేమి" యని యొక్కమాటలో విదూషకుని వదలించుకొని పోయి నిజకార్య తత్పరుఁ డయిన యాదర్శమంత్రి యితఁడు.

దశరథుని పాత్రపోషణ మెంత శ్లాఘాపాత్రముగా భాసుఁ డిందు నిర్వహించినాఁడో చూడుఁడు. దశరథుఁడు :

"సవనశతం బొనర్చు నొకచాయను ; జూచుకొనున్ స్వకార్యముల్
వివిధము లొక్కవంక; నరివీరుల నుక్కడఁగించు నొక్కటన్;
మిత్రులఁ దన్ను నొక్కెడల మిత్రుల; నొక్కట వేఁట కేఁగు ని
ట్లవిరళ కార్యభారమున నందఁడు, దుఃఖ మొకింతయేనియున్."

దశరథుఁడు రాజ్యము చేయుచుండఁగా :

"కాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యౌఘరాశి
ఫల మనంత మొసంగెడు; నలఘుపుణ్య
కలితదైవానుకూల్యంబు కలుగుకతన."

సర్వలోకములకు సర్వకాలములకు నాదర్శప్రాయమైన రాజ్యమునకుఁ బ్రాతిపదిక వేసినమహారాజు దశరథుఁడు. ఈతని రాజ్యపాలనమే యిట్లున్నదన్న నిఁక రామరాజ్య మెట్లుండునో యూహించుకొనుఁడని చమత్కారముగా భాస్కరుఁడు సూచించినాఁడు.

సందర్భానుసారముగా నిట్లు పాత్రముల శీలచిత్రణము చేయుటలో భాస్కరుఁడందె వేసినచేయి.

రామపట్టాభిషేకవిఘ్నకారిణి యని జగముచే నేఁటికిని నిందింపఁబడుచునే యున్న కైకేయిశీలము పరమనికృష్టముగా నితఁడు చిత్రించినాఁడు. ఆమెస్వభావము నెంతచక్కఁగా దశరథునినోటఁ గవి చెప్పుచున్నాఁడో కనుఁడు:

"ఏకరణివచ్చుచుండునో, యీకాంతకు ముక్కునందె యొసఁగును దయ, యం
తేకాని విక్రమాన్విత, నాకష్టము బాపి యునుసు నాపం గాచెన్."

"ఈమెకోపము పరిగణియింపరాని
దగును శౌర్యప్రణయశీల యగుటచేత
తలఁప ఛందోనుబద్ధవృత్తంబురీతి
శీఘ్రమునసే ప్రసాదసంసిద్ధి గూర్చు."

మహానుభావురా లగు కైకేయి దాయభాగ విభాగ ప్రసంగసమయమున రాజుతో సవతులయెదుట నెంత పవిత్రముగ మాటాడుచున్నదో చూడుఁడు :

"అగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవర్ధనుఁడు మేలు కోటిరత్న
భాస్వరం బయి వెలుఁగుదీపంబు రాత్రి
గాని యది యెంత మధ్యాహ్నభానుముంగ."
"నరపతుఁడు గుణి యగు గణవ
స్త్రుఁడగు రాముండు కాఁడె పెను చెలుఁడే రా
జ్యాగమం బైకోన సుగుణా
భరణుం డతఁ డతనికన్నఁ బరముఁడు కలఁడే ?"

ఇట్లు ప్రతిపాత్రము విషయమునను గడుజాగరూకతతోఁ దూఁగినట్లు మాటలు వేయుచు ముక్తసరిగ వలసినవిషయము లన్నియు నచ్చునట్లు శిలాచిత్రణమును జేసిన శిల్పిరత్నము భాసమహాకవి.

ఇట్లు భాసుఁ డింపుఁ బోషించిన పరశురాముని శీలము నిరుపమానమైనది. భవభూతియంతటిమహాకవి కూడ నవతారపురుషుఁ డగు పరశురాముని దశరథ జనకరాజర్షులు రాసహాదులు నోటికి వచ్చినమాట లని యుద్ధమునకు సిద్ధపడినట్లు మహావీరచరిత్రమునఁ గల్పించినాఁడు. అసలీ రామద్వయ సమాగమ ప్రధానోద్దేశ మేమన భృగురాముఁ డవతారమును జాలించుచుఁ దన తేజమును రామతేజములో నైక్యమొనరించి తన ధను వాతని కొసఁగి దుష్టశిక్షణ శిష్టరక్షణ కార్యకలాప మాతనిపై విడుచుటయే. ఈ యాంతరరహస్యమును జక్కఁగా గ్రహించి ఆ సమాగమసమయమున నన్ని పాత్రముల శీలముల నత్యద్భుతముగా నిర్వహించిన దొక్క భాసుఁడే. అదియు నీ యజ్ఞఫలముననే. క్రుద్ధుఁడై వచ్చిన పరశురాముని దశరథ జనకాదులు రామలక్ష్మణాదులు వసిష్ఠ విశ్వామిత్ర శతానం

దులు నమస్కారనతశిరస్సులచే శాంతపఱచిరి. ఆ మహాత్ముఁడు కోదండము నొసంగి :

"పాపులఁ బరిమార్చుటకై, చేపట్టుము నీవు దీని; క్షితి ధర్మాత్ముల్
ప్రాపించి శరణుచొచ్చిన, నేపగిదిని వారిఁ గాచి యేలుము రామా!"

అని శాసించి తాను శాంతుఁడై నిష్క్రమించును. ఇంతకు నాతఁడు చేసిన పనులెల్ల ధర్మరక్షణార్థము, ఖల శిక్షణార్థము నని భాసుఁడు పరశురాముని నోటనే పలికించి యాతని శీల మత్యున్నతముగఁ బోషించినాఁడు.

## అలంకార సంపద : సుభాషితములు

స్పష్టమై స్వచ్ఛమై త్రికాలాబాధ్యములై తీయదీయములు గలిగిన భాసుని యలంకారములు సుభాషితములు, నీ నాటకమున లెక్కకు మిక్కిలిగా నున్నవి.

"సరసులోని యగాధంబు జలములోన, నెసఁగు నుత్తమమానసౌకసము లవ్వి
సకల రసపూర్ణ కవిచిత్త సద్మ మందుఁ, బరఁగు నుజ్జ్వలనూత్న భావంబు లనఁగ"

"మనసె కాద కృత్యాకృత్య మతి వివేకమునకు నుత్తమ ప్రామాణ్య మున ధరిత్రి"

"కేసరిని సుంగు తయుఁ జెల్లగింప గనెనె?"

"కాలవశమునఁ బుణ్యంబు క్షయము నొందఁ సారహీనముతో నెట్టిసంపదలును."

ఇట్టివెన్నియైనఁ జూపవచ్చును.

## నవరస పోషణము — శృంగారము

ఈ నాటకమున నవరసపోషణము ఆయాతావులఁ జక్కఁగా నిర్వహింపఁ బడినను, ఇందు ప్రధానరసము శృంగారము. ఇది మిథిలోద్యానమున సీతారాముల పరస్పర వీక్షణములతో నారంభమై రామానురక్తయై మూర్ఛిల్లిన సీతను రాముఁడు సమీపించుటతో వృద్ధియై సీతాకల్యాణమున శుభ

పర్యవసానము నందినది. ఇందలి శృంగారము పరమ పవిత్రమైనది. నాయకుఁడగు రాముని ప్రణయము అస్థానమునఁగాక స్వస్థానమున నగుట యొక విశేషము. మఱి యిది పేలవములగు కచకుచాది వర్ణనములతోఁ గాక కేవలము స్త్రీ సౌందర్య ద్యోతకము లగుముఖకాంతిసౌందర్యములకే సంబంధించినది.

"స్వచ్ఛసుందరశరదిందువదన"

"అజగన్మోహనాంగి" "కుసుమకోమలసుగాత్రి"

"సుందరీరత్న వదనారవిందమునఁ గని, మన్మథము నాట్యమొనరించు మహితభంగి."

మున్నగు మనోహరభావములతోడనే కాని నీచ శృంగారమునకుఁ గాని గతానుగతికమగు నవయవవర్ణనములకుఁ గాని పోక భాసుఁడిందలి సీతారామ శృంగారమును బవిత్రతర మొనరించినాఁడు.

## హాస్యరస పోషణము

భాసుని హాస్యరసపోషణమునకుఁ దొలుతటి యంకము నందలి విదూషక కాంచుకీయ సంభాషణము చక్కని యుదాహరణము. ఇదికాక, నాల్గవ యంకమునకుఁ బూర్వమునఁగల ప్రవేశికలో జనకరాజ ప్రాసాదమున మాళవకుఁడు, భషకుఁడు, దంతిలుఁడు, గోపిలుఁడు అను నలుగురు వైతాళికులు జరిపిన సంభాషణము, విదూషకుఁడు వచ్చిన పిమ్మట ఆతఁడు విశ్వామిత్రుఁడు ఉభయతోముఖుఁడని వికృతముగా వర్ణించిన వర్ణనములు మున్నగునవి అబాధకములైన భాసుని హాస్యసంభాషణములకు సాక్ష్యములు.

## కరుణరసము

విశ్వామిత్రుని వెంట నడుగు రామలక్ష్మణులు గ్రామ సీమలఁ గనుచు వృద్ధగోపికతోఁ జేసిన సంభాషణము, తమ కప కారము చేయుచున్న మృగములనైనను జంపవల దనియు నవి యొక్క నాఁడు కానరాని చో విచారించెద మని యామె చెప్పిన పట్టులను గరుణరసము లలితముగాఁ జూపఁబడినది.

## వీరభయానకబీభత్సరసములు

రాముఁడు తాను విడచిన రెండుబాణములు వ్యర్థములై నపుడు వీరగర్జన మొనరించి భయంకరముగాఁ బలికినపుడు వీర భయానక రసములు, పిప్పలవృక్షము నాకులు చిల్లులుపడి యుండుట, రథము గుఱ్ఱములు కానరాకుండ వాని యానవాళ్లు గనిపించుటచేఁ గలఁగి పాఱిపోయిన చెలికత్తెలస్థితి గనుఁగొన్న పుడు బీభత్సరసము పోషింపఁబడినవి.

## శాంతరసపోషణము

జనకరాజర్షి శీలపోషణముపట్ల శాంతరసము చక్కఁగా నిరూపిత మగుచున్నది. "దేశాంతరమో జన్మాంతరమో, ఏమైనను జీవికి స్వకృత్యము ననుసరించి పోనక తప్పదు. వెళ్ళిన పిదప నెవరు బంధుజనులకు బాధ కలిగింపరో మఱి తాము దుర్గతి నందరో వారే ధన్యులు." మున్నగు జనకుని వాక్యములు శాంతరస ప్రతిపాదకములు.

"ఒక్కటయ్యును నాత్మ తానక్కజముగ
వివిధరీతుల మనలోన వెలయుచుండు."

అన్న జనకుని విజ్ఞాన విశేషమున శాంతరసము పారము గన్నది.

## అద్భుతరసము

భరతలక్ష్మణ శత్రుఘ్నుల ధనుర్విద్యా ప్రదర్శనమునను, శ్రీరాముఁడు శివధనుర్భంగ మొనరించినపట్టునను, శ్రీరామ లక్ష్మణులు రాక్షసులను పెక్కువిధములఁ గాఱిఁద్రోలి మారీచసుబాహుల నుక్కణఁచు పట్టునను అద్భుతరసము పోషింపఁబడినది. అదికాక :

> "నలువయు విష్ణువుఁ శివుఁడు నారదతుంబురు లింద్రుఁడుఁ; గుతూహలులయి కల్పవృక్షకుసుమావళిఁ జల్లుచు "

అనుపట్టునను అద్భుతరస పోషణము గలదు.

## ఉపసంహారము

ఈ విధముగా 'యజ్ఞఫల' మను నూతన భాసనాటకము నవరస సంపదలకు మనోహరాలంకార సుభాషితములకు భాసుని ప్రతిభా విశేషములకు నాలవాలమైన దనుటలో నత్యుక్తి లేదు. కాలగర్భమున లీనమైయున్న ఆ మహా కవీశ్వరుని యితరనాటకములు నితర గ్రంథములు బయలువడి సంస్కృత వాఙ్మయాకాశమున ధ్రువతారలై వెల్గొందు సుముహూర్తము త్వరలో వచ్చెయుఁగాక !

## కృతజ్ఞత

ఈ నాటకము తొలుత "భారతి" ఫిబ్రవరి, మార్చి, ఏప్రిలుసంచికలలోఁ బ్రకటించితిని. పలువురు దీనిని గ్రంథరూపమునఁ దెమ్మని తొందర చేసిరి. మూలముతో సరిచూచుటలో

నటీ నటుఁ జక్కని సూచనలు చేయుటలో నా కెంతయో తోడ్పడిన మిత్రులు శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి గారి మేలు మఱవఁ జాలను. ఉత్తమనాటకమగు దీని నెల్ల రాదరింతురని విశ్వసించు చున్నాను.

కాకినాడ,
౧౯-౭-౨౨.

ఇట్లు విధేయుఁడు,
బులుసు వేంకటేశ్వరులు.



ఓం

శ్రీ గురుభ్యో నమః

# యజ్ఞఫలము

## ప్రథమాంకము

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును]



సూత్రధారుఁడు

రాముండు కృపాళుతా భరత సు
శ్రీమంజులాత్ముండు వి
స్ఫారశ్రీశుభలక్ష్మణప్రథితుఁడున్
శత్రుఘ్నవీరుండు వి
స్తారిప్రాభవమానిచంద్రకృతయ
జ్ఞత్రాత, కోదండహ
స్తారాముండు ప్రసన్నమూర్తి నిరతో
త్సాహుండు మిమ్మోముతన్ !

(తెరవంకఁ జూచి) ఆర్యా ! ఒకసారి యిటు రమ్ము.

నటి:—(ప్రవేశించి) ఆర్యపుత్రా ! వచ్చితిని. ఏమిపని ?

సూత్ర:—సఖీ ! ఈసభాసదులు మనము ప్రయోగించునాటకముఁ జూడఁగోరుచున్నారు. వీరిసంతోషముకొఱకై వసంతఋతువునుగూర్చి నీ వొకపాట పాడుము.

నటి:—సరే. (పాడును)

ఉత్సాహ. క్రొంజివుళ్ళశోభ మిగులఁ
గోమలంబు లౌలతల్
మంజులంబు లగుచుఁ దీయ
మామిడుల్ సుగంధులై
రంజిలంగ నుపవనంబు
రమ్యమై ప్రసన్నమౌ
సంజవేళ మల్లెపూలు
సరసమాడ నవ్వులన్. ౨

సూత్ర:—బాగు! బాగు! నీపాటవలన నందఱును సంతోషించు
చున్నారు.

(తెరలో) ఏమి? ఏల సంతోషింపరు?

సూత్ర:—(విని) ఓహో!

గీ. పుత్త్రజననోత్సవంబున భూవిభుండు
తనర, నుత్సవదానసత్కారములను
వారు లెల్లర సంతోషపఱిచి మిగుల
నిదె సుమంత్రి సుమంత్రుఁ డీ ప్లోఁగుదెంచె. 3

(నిష్క్రమింతురు.)

ఇది స్థాపన.



# యజ్ఞఫలము

## ప్రథమాంకము

[ప్రవేశము:—సుమంత్రుఁడు]

సుమం:—ఏమి? ఏల సంతోషింపరు?

ఉ. పౌరులఁ దృప్తిఁ గూర్చితిని బ్రాహ్మణజాతిని భోజనార్థవి
స్తారసుఖాబ్ధిఁ దేల్చితిని దన్పితి శ్రోత్రియసంతతిన్ యథా
చారము, వాంఛితార్థములు సర్వజనంబుల కిచ్చినాఁడ స
త్కారపరంపరన్, జనవితానము తోషము నందకుండునే! ర

కంచుకి:—(ప్రవేశించి) అమాత్యా! పురజనులను జానపదులను నందఱను యథేచ్ఛము లబ్ధకాములను గావింపు మని నీకు రాజాజ్ఞ. ఒక్కఁ డర్థియైనఁ గోరికతీరనివాఁ డుండరాదు.

సుమం:—మహారాజుమనసు తెలిసి నేనే యవి యన్నియు నొనరించితిని.

కంచు:—మంచిది. అమాత్యా! మంచిది. నృపతియింగిత మెఱిఁగి ప్రవర్తించినమంత్రి శుభప్రద మగుభవిష్యత్తును ధర్మమార్గమున స్వర్గమును జూఱఁగొనఁగలఁడు. ప్రాడ్వివాకులతీర్పు ననుసరించి కారాగృహాబద్ధు లయిన వారి నెల్లరిని విడిపింపు మనియు నీకు రాజాజ్ఞ.

సుమం:—దొంగలు కాని, శత్రులు కాని, వేదవణిజులు కాని, పర స్త్రీకాములు కాని, జూదరులు కాని, త్రాగుఁబోతు

లు కాని, రాజదాసీప్రియులు కాని, లేక స్వర్గతుల్యముగా నున్న మనరాజ్యమునఁ గారాగృహబద్ధు లెవ రున్నారు? ఇంతవఱకుఁ బిత్రృణమున బద్ధుఁడై యున్నవాఁడు మన మహారాజొక్కఁడే. కొడుకులఁ గని యాయనయు విముక్తుఁడై యున్నాఁడుకదా!

విదూషకుఁడు—(ప్రవేశించి) మహారాజుపుత్త్రకామేష్టి యిప్పుడే సఫలమైనది. ఇన్నాళ్లు నేను మోదకములు మెక్కుట లో నాజఠరముపై నేమాత్రము జాలి చూపలేదు. ఇటువంటియజ్ఞములు నాలుగైనవా నే నప్రతిరఘుండ నగుమోదక వైరి నగుదును. నావంటివిప్రులు భోజనము చేసి తుష్టు లగుచో నేయజ్ఞకర్మము సఫలము కాదు?

సుమం:—ఓయీ! సుందరకా! నీకు సువర్ణము చాలినంత లభించినదా?

విదూ:—ఏమి? తినుటకుఁ గాని త్రాగుటకుఁ గాని కట్టుకొనుటకుఁ గాని పనికిరానిపాడుబంగారముతో నాకుఁ బని యేమి? బంగారము ప్రియ మగుటకు నేను రాజు నను కొంటివా కోమటి ననుకొంటివా?

కంచు:—ఓమహాబ్రాహ్మణా! మఱి నీ కేది ప్రియము?

విదూ:—మోదకభోజనము.

కంచు:—నీ వెన్ని మోదకములు తినఁగలవు?

విదూ:—మహారఘుఁ డగుమహారా జెన్ని వేలమందిశత్రువులను జంపఁగలఁడో యన్ని వేలు.

కంచు:—పదివేలమందిశత్రువులను జయింపఁగలవాఁడే మహారథుఁడు.

విదూ:—అయిన, నేను పదివేలమోదకములఁ దినఁగలమహా
రఘుఁడను.

కంచు:—ఏమి! ఒక్కదినమున నెవ్వఁడైనఁ బదివేలమోదకములఁ
దినఁగలఁడా ?

విదూ:—ఏమి ! ఒక్కదినములో నేమహారఘుఁడైనఁ బదివేల
మందిని జంపఁగలఁడా ?

కంచు:—పదివేలమందిలోఁ గొంతమంది చనిపోదురు. కొంత
మంది పాఱిపోదురు. కొంతమంది చెల్లాచెదరగుదురు.
కొంతమంది శరణుచొత్తురు. వీరిని మహారఘుఁడు
రక్షించును.

విదూ:—నేనును గొన్ని మోదకములను మ్రింగుదును. కొన్ని
టిని జెదరఁగొట్టుదును. కొన్నిటిని జిదుకఁగొట్టుదును.
కొన్నిటిని దాఁచుకొందును.

సుమం:—బాభ్రవ్యా ! వైతండికుఁడు హేతువాదమున కొప్పు
కొనఁడు. వీనితో నేమి ? నేను నాపని చూచుకొని
మహారాజు నభినందింప నేఁగుదును.
(ముందు చూచి) ఓహో ! మహారాజు సపరివారముగా
నిటే వచ్చుచున్నాఁడు.

కంచు:—నేను నాపని చూచుకొందును. (నిష్క్రమించును.)

విదూ:—నేను తినఁగా మిగిలినమోదకములను దాఁచుకొనఁ
బోవుదును. (నిష్క్రమించును.)

సుమం:—ఆహా ! మహారాజు వార్ధకదశఁజెందైన నెంతరమణీ
యాకృతితో నొప్పుచున్నాఁడు ! నిత్యము రాజకార్య
ముల నిర్వహించుచున్నను నీతఁడు శ్రమ మెఱుఁగక

ప్రసన్నులుగానే యుండును.

చ. సవనశతంబొనర్చె నొకచాయను, జూడఁ గొను స్వకార్యము
ల్వివిధము లొక్కవంక, నరిపీరుల నుక్కడఁగించు నొక్కటక్,
మివులఁ బ్రసన్నుఁడౌ నొకట మిత్త్రుల, కొక్కట వేఁట కేఁగు, ని
ట్లవిరళ కార్యభారమున నంచఁడు దుఃఖ మొకింత యేనియున్.

నిజకర్మకరణముపట్ల నాతఁ డతియుత్సుకుఁడు. ముదిమి పైఁ బడినను మహాతేజ మాతనిని వీడదయ్యె. ప్రజ లాతని పేరు విన్నమాత్రముననే పాపదూరులై స్వధర్మనిర్వాహకు లగుచుందురుగదా !

[సపరివారము రాజు ప్రవేశించును.]

రాజు:—ఆహా ! రాజ్యమునకు శత్రుభయమే లేదాయె. ప్రజ లా ధర్మసంపద్యుతులై పరవస్తువాంఛయే యెఱుఁగరు. రుజాభరము కాని చాపమరణము కాని లేనే లేవు.

గీ. కాలవర్షంబుఁ గురియు మేఘుంబు లెప్పుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగెడు; నలఘుపుణ్య
కలితదైవానుకూల్యంబు కలుగుకతన. ౬

వేదములా యధీతము లైనవి; రిపులా నిరస్తు లైరి; ప్రజ లా పుత్త్రసములుగాఁ బరిపాలితు లైరి; ఇష్టధనకీర్తులా సంప్రాప్తించినవి. ఇపుడు నేను జేయఁదగినపని యే తోఁప దయ్యెను. దేవతలు పితరులు విప్రులు దీనులు శరణాగతులు యథావిధిఁ గులాచారానుసరణిఁ బూజితులైరి. ఇంతేకాక—

గీ. పుత్త్రిజననంబుచేఁ బరిపూర్ణ మయ్యె
మన్మనోరథ, మన్వయమహిమ మొప్పె
నెట్టిలోపంబు లేకపోయిన, నికామ
తృప్తిఁ గనదయ్యె నాచిత్త మేమొ కాని. ౭

సుమం:—(చేరి) మహారాజా! జయము. ప్రజాపాలనయోగ్యులగుపుత్త్రిలపై రాజ్యభారము నిడి నీవు మహాసంతోషము నొంద నున్నావుకదా!

రాజు:—రమ్ము. సుమంత్రా! నీవు వెంటనే సర్వార్థిజనమును సఫలాశాచిత్తులఁ గావింపుము.

సుమం:—మహారాజా! కావించితిని.

రాజు:—శ్రోత్రియులను గోహిరణ్యాదానములచే సత్కరింపుము.

సుమం:—సత్కరించితిని.

రాజు:—బద్ధు లగునరులను విడిపింపుము.

సుమం:—మహారాజా! నీవు ధర్మపరిపాలనమున భూమి నేలుచుంటివి. ఈభువిపై దివియే సాక్షాత్కరించినది. ఇఁక, నిట బద్ధు లెవ రుందురు?

రాజు:—ఏమి! ఇంతవిశాల మైనరాజ్యమున నధర్మ మాచరించి బద్ధదండము విధింపఁబడినవాఁడే లేఁడు! పూర్వపుణ్యప్రభావము!

సుమం:—

గీ. రాజసింహుఁడవై నీవు రాజ్య మేల
దుష్కృతం బొనరింపఁగాఁ దొడఁగు నెవఁడు?
సూర్యుఁడు నిరభ్రగగనాన శోభిలంగ
దారి కడ్డము వచ్చునే తమము తలఁప? ౮

బద్ధులే లేనికారణమున బద్ధమోక్షణప్రశంసయే లేదు. పితృఋణవిషయమున బద్ధుఁడ వైనవాఁడవు నీ వొక్కఁడవే యుండెడివాఁడవు. కాని, నీవును బంధవిముక్తి నందియుంటివి.

రాజు:—ఔను. నిజమే. పితరులఋణము తీర్పఁ గంటిని. బద్ధముక్తి నందితిని. కాని, మఱియొకదృఢతరబంధమే కలిగినది. దానినుండి విముక్తిఁ గనఁజాలను.

సుమం:—ఏమది ?

రాజు:—ఏమందువా ? అధ్యయనము చేయించి, వినయమును నేర్పి, శ్రుతుల నొనరించి, వాసిష్ఠధర్మాన్వితనృపగుణముల నలవఱిచి, ప్రజారక్షణయోగ్య మగు రాజద్వేషవివర్జితమనస్సును బెంపొందఁజేసి, శత్రువులకు భీతి పుట్టించి పాఱిపోఁజేయునస్త్రసంపదల నారితేఱఁజేసి, నలువురుపుత్త్రులను బోషింపవలయునుగదా ! ఇట్లు చేయలేనినాఁడు నేను ధర్మనాశకుఁడ నగుదును. అందుచేఁ బుత్త్రోదయమువలన నే నెన్నిధర్మబంధములకు లోనైతినో కనుము. సుమంత్రా ! ఇంతకు

గీ. దృఢతరంబుగ నన్ను బంధించెఁ బుత్త్ర
రాగపాశంబు కట ! త్రెంపరాదు దీని
బ్రతికియున్నంతకాల మీబంధనంబు
నుండి వెలువడ వాంఛింప నుందువాఁడ. ౯

ప్రతీహారి:—(ప్రవేశించి) మహారాజా ! జయము. పుత్త్రోత్సవమైనపిదపఁ గౌసల్యాదేవి మహారాజును జూడ వేడుక

పడుమన్నది. తాను పెద్దభార్య గాన మొదటఁ దన్నే సంభావింపఁ గోరుకొన్నది.

రాజు:—విజయా! ఆమె సద్వంశప్రభవ. పాణిగ్రహణలాలిత. ఆలంబభూత. ఆమెను యష్టివలె మన్నింపవలయును.

చేటి:—(ప్రవేశించి) మహారాజా! జయము. సుమిత్రాదేవి మహారాజుకృపచేఁ గుశల మనియుఁ దా నిద్దఱుకుమారులను గన్నతల్లి యగుటచే ముందుగాఁ దన్నే సంభావింపఁ గోరుకొన్న దనియుఁ జెప్పుమన్నది.

రాజు:—వినయవతీ! సర్వంసహ యగుసుమిత్రాదేవి మిత్రతుల్యురాలు. మన్నియోగవర్తిని. వశంవద. ఆమెను పేక్షింపఁజాలను.

[అంత మంథర, విదూషకుఁడు ప్రవేశింతురు.]

మంథ:—మహారాజా! అభిజనానురూపాదరయు రాణులలోఁ గనిష్ఠ యయ్యు గుణములలో జ్యేష్ఠయు, తన్వి యయ్యు సగౌరవయు, మహారాజబహుమతయు, అప్రతిరథుఁడగు కేకయరాజుకూఁతురును నగుదేవి తానే ముందు సంభావింపఁదగిన దని నివేదింపు మన్నది.

విదూ:—(తనలో) అమ్మో! ఈరండవచనోపన్యాసము తర్జనసహితము! (ప్రకాశముగా) వయస్యా! ఉపేక్షించినచోఁ గనిష్ఠ యగుదేవి యేమిచేయునో కొంచెము తెలిసికొని పిమ్మట సమాధాన మిమ్ము.

రాజు:—(తనలో) ఈమె ప్రతిజ్ఞాతసుతాభిషేక. సింహివలె దుర్వారమహాప్రకోప. ఈమెను రాణులతో సమానముగా ననునయింపవలయు. (ప్రకాశముగా) మంథరా! మువ్వు

రను క్రమముగాఁ బిలిచెదను. ఏలన, బుద్ధిమంతులు ధర్మార్థకామములను సమభావముననే సేవింతురుగదా! అట్లే, నేను సపుత్త్రిల ముప్వురను సమముగా సంభావింతును. కాన, మధ్యమమందిరమున నందఱు నారాక నిరీక్షించుచుండుఁ డంటి నని చెప్పుఁడు.

మంథ:—(తనలో) ఏమి! మారాణిని ముందు గౌరవింపఁడా? (ప్రకాశముగా) మహారాజు సెలవుప్రకారమే.

[ప్రతీహారి, చేటి, మంథర నిష్క్రమింతురు]

విదూ:—వయస్యా! నీకు ముప్వురదేవులయందు సమానాదరము కలదు. సుమిత్రయిద్దఱుకొడుకులమీఁద కైకేయి పుత్త్రునిపైఁ జూపునాదరములో సగముమాత్రమే చూపుదువు!

రాజు:—వయస్యా! చతుర్విధపురుషార్థములలో భేదము లేనట్లే నాకు నలువురుకుమారులలోను భేదభావము లేదు. నాలుగువేదములలో నొకవేదము తక్కువ మఱియొకటి యెక్కువ యన్నతఁడు విప్రుఁడు కాఁడు.

విదూ:—(తనలో) ముగ్గురురాణులు త్రివర్గతుల్యలు. నలుగురు కొడుకులు చతుర్వర్గతుల్యులు. ఐదుగురు సమకూడిన చో నేమనునో? (ప్రకాశముగా) పురుషార్థములు వేదములు నాలుగే కనుక పుత్త్రులతో సమానముగాఁ బోషణీయుఁడ నగుకనిష్ఠవయస్యుని నన్ను నీవు ప్రేమించుట లేదు. అవునా?

రాజు:—(నవ్వి) పంచమహాయజ్ఞములు విప్రులకు సమానములు. ఈయైదిటితో మీరు మించెదరు. నీ కిఁక సంశయమేల?

విదూ:—(తనలో) ఆఱుగురు లేరు. ఉన్న నీమాటకారితనము తెలిసిపోయెడిదే! (ప్రకాశముగా) కొడుకులు పుట్టినదిన మన్నయుత్సాహముతో నీ వాఁకలిసైతము మఱచితివి. సూర్యుఁ డస్తమించుచున్నాఁడు చూడుము.

రాజు:—ఓహో! సంధ్యాసమయ మైనది.

చ. శరణ మొసంగుచెట్ల ద్విజసంతతి చేరెఁ గిలారవంబులన్
గిరణములన్ నభస్థలిని సింపెను నక్షశశాంకుఁ డప్పుడే
యరుణగభస్తిబింబ మది యస్తము; మిక్కిలి భాసమానమై
పరగెను దీపికారుచి క్షపావదనోజ్జ్వలభూషణంబనన్. ౧౦

మఱియు:

ఉ. అల్లదె భూమికిన్ దిగినయట్లు విధుండు సరోజలంబులన్
ఫుల్లనవోత్పలప్రసవపుంజములన్ బ్రతిబింబ మొప్ప రం
జిల్లు విధేయులై విమలచిత్తులు నెవ్వరు వెల్లఁ గొల్వఁగా
నల్లన వారికిన్ దగిన యాజ్ఞ లొసంగెడిరాజరాజనన్. ౧౧

(నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.

---

## విష్కంభము i

[ప్రవేశము : కాంచుకీయుఁడు]

కాంచు:—మహారాజు నాకి ట్లాజ్ఞాపించెను. “ఓ బాభ్రవ్యా! ధారాగృహముకడ నున్నగ్రీష్మోద్యానమున కేఁగి యచటఁ బరిజను లెవ్వరు నుండరా దని యాజ్ఞాపింపుము.” మహారాజు గాయకులతో నటకు విహారమునకు

వచ్చునఁట. పరిజను లుండరా దని యేల యనెనో? ఏదైన రహస్యాలోచనము కలదా? రాజులకో రహస్యాలోచన మాతఁ డెప్పుడును జేసి యుండలేదే! నాకీగోడవ యేల? న న్నేమి చేయుమన్న నదే చేయుదును. రాజకర్మ మంతయు నిగూఢభావవిలసితము. అది సుమంత్రులకే కాని మావంటివారికిఁ దెలియదు. రాజు లతిగుప్తకృత్యులై శంకితస్వాంతు లయియే యుందురు. వారు కన్నులు మూసికొనియు జాగ్రదవస్థలోనే యుందురు.

[చేటికలు ప్రవేశింతురు]

చేటి:—ఆర్యా! నలుగురుకుమారులకు నాలుగుకుసుమజవనికలను మేము సూత్ర మక్కఱ లేకయే తయారు చేయుచున్నాము.

కాంచు:—మంచిదే. కాని, మఱియొకయుద్యానమున కేఁగి వీరిఁ రీపని చేయుఁడు.

ఇంకొకచేటిక:—ఆర్యా! ఇంకొకయుద్యానమున నిన్నిరంగులు నింతపరిమళము కలిగినపువ్వు లిన్ని లభింపవు.

కాంచు:—ఐన నే నేమి చేయఁగలను? ఇపు డెవరు నిట నుండరా దని మహారాజాజ్ఞ.

చేటికలు:—ఐన పోఁ బోవుదుము. (నిష్క్రమింతురు.)

కాంచు:—ఈయుద్యానమున నీఁగ యైనను లేకుండఁ జేసితిని. మహారాజుకడ కేఁగి యీవిషయము నివేదింతును.

(నిష్క్రమించును)

ఇది విష్కంభము.

---

# యజ్ఞఫలము

## ద్వితీయాంకము

[పరిజనులు సేవించుచుండ మహారాజు ప్రవేశించును.]

రాజు:—(స్వేచ్ఛగా నడచి) ఆర్షవిధి ననుసరించి యజ్ఞము లెన్నో యొనరించితిని. అర్థుల కెందఱకో ధనము లొసంగితిని. ప్రజలకు సుఖము లొనగూర్చితిని. రిపులకు యుద్ధభీతి కలిగించితిని. ఇన్నాళ్ళ కిపుడు కొంచెము జరాభరాయాసము కలిగినది. ఐనను,

ఉ. కంటి స్వకీయసౌఖ్యమునకంటెఁ బ్రజాసుఖ మెక్కుడంచుఁ, గై
కొంటిఁ గులానురూప మనుకూలయశస్సము పార్జనంబు, నే
నుంటి స్వకర్మముల్ విడువకున్నతభోగము లెల్ల నంది, చే
కొంటి జనానురాగ మనుకూల మొనర్చెద వేగ శిష్టముల్.

(ఆలోచించి)

గీ. రాణులను మువ్వురనుగూడ రంజిలంగఁ
జేసి రాజగుణాన్వితశ్రీఁ జెలంగు
రామచంద్రుని రఘువంశరత్నసదృశు
యౌవరాజ్యాభిషిక్తుఁ జేయం దలంతు. ౨

ఎవ రక్కడ ?

ప్రతీహారి:—(ప్రవేశించి) మహారాజా! జయము. ఏమాజ్ఞ ?

రాజు:—విజయా! మంత్రి సుమంత్రుని బిలువుము.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించి సుమంత్రునితోఁ బ్రవేశించి) ఆర్యా!

ఇటు. ఇటు. ఇదిగో! మహారాజు. సమీపింపుము.

సుమం:—(చేరి) మహారాజా! జయము.

రాజు:—అమాత్యా! స్వాగతము. రమ్ము. కూర్చుండుము.
(ఇరువురు కూర్చుందురు.)

రాజు:—విజయా! నీవు పొమ్ము. (పరిజనులను జూచి) మీరును బోయి విశ్రాంతి నందుఁడు.

పరి:—చిత్తము. (నిష్క్రమింతురు.)

రాజు:—అమాత్యా! నేఁడు నామనస్సు చింతాజాగరణపరవశమై యున్నది.

సుమం:—(తనలో) ఏమి! ఈతఁడు మహాయశస్వి. రిపుభయప్రదుఁడు. ప్రజలను గన్నబిడ్డలవలెఁ బాలించువాఁడు. ఈతని కెట్టిచింత కలిగెనో? (ప్రకాశముగా) మహారాజా!

మ. స్థిరధర్మవ్రతముఁ బ్రజాప్రియమహాదృష్టమ్ము నిశ్శత్రుతా
గురుతఁ గాంచినరాజసింహుఁడవు నీకుఁ వీరులై పుట్టి న!
ల్వురుపుత్రుల్వినయాన్వితుల్ ప్రజల కెప్డుం బ్రేమపాత్రంబులై
పరఁగ న్మానసికవ్యథాభరము దేవా! యెట్లు కల్గెం గటా!

మఱియు సంస్కృతులు వినయోపేతులు ప్రజారంజనతత్పరులు నగునలువురుకొడుకులను గాంచి చింతలు విడిచిపెట్టవలెతివా? లేక, పెద్దకుటుంబము గలగృహమేధి కెట్లనవరతము నేదోయొకచింత కలుగుచునే యుండునో యట్లే యీవిశాలరాజ్య మనుకుటుంబబాహుళ్యమున నీకుఁ జింత కల్గినదా? పోనిమ్ము. చింతాప్రతీకార మూహింపలేదా?

రాజు:—అందులకే నిన్నుఁ బిలిచినది.

సుమం:—సెల విమ్ము.

రాజు:—కైకేయీతనయుఁడే నాసకలరాజ్యము ననుభవింపఁ గలఁ డని యవివేకినై తొలుతఁ గైకకు వర మిచ్చితిని.

సుమం:—ఐన ?

రాజు:—క్షత్త్రిగుణాకరుఁ డగు రాముఁడే రాజ్యపాలనయోగ్యుఁడు. ఆతనికి యువరాజపట్టము గట్టుటే నా కోరిక. ఇది సులభమా ?

సుమం:—మహారాజా! అది దుష్కరము కాదు.

రాజు:—ఎట్లు ?

సుమం:—మహారాజా !

చ వినయనయప్రవర్తనవివేకగుణాదికపూర్ణుఁడైనరా
ముని ముగురమ్మలుఁ దమదుముద్దులబిడ్డని గాఁగఁ బ్రేమపెం
పునఁ గనుఁగొంద్రు; జ్యేష్ఠునిఁగ భూరిగుణంబులఁ దేజమందునా
తని కభిషేకమన్నను ముదంబును గాంతురు రాణులందఱున్.

అందుచే నీవు చింతింపవలసినపని లేదు. ఇంతకుఁ గుమారు లుపనీతులైరి. శస్త్రశాస్త్రాధ్యయనపూర్ణులైనపిదపఁగదా యభిషేకము. ఇప్పటినుండియ నీచింత యేల ?

రాజు:—అనాగతము విప్రకృష్టము నగుభావిని గూర్చి చింతించువానికిఁ గష్టము కలుగదు. వచ్చి పైఁబడ్డవిషాదమును స్మరించుకొనునరున కనూన మగుకష్టము కలుగును. కావున, పుత్త్రరాజ్యాభిషేకవివాదహేతువు నిప్పటి నుండి యాలోచించిన నప్పటి కేయుపాయముచేనైన దానిని దొలఁగించుకొనవచ్చును గదా !

సుమం:—సరే నా కేమి యాజ్ఞ ?

రాజు:—

చ. పరిజనభృత్యమంత్రిజనపౌరజనంబులు రాణులున్ నిరం
తరమును రామమానసు లనారతరామవిధేయచిత్త లా
కరణి నొనర్పు మాభరతు గాఢతరాగ్రజభక్తియుక్తసం
భరితు నొనర్పు మియ్యది సుమంత్ర ! తలంచు మదాత్మ
శల్యమున్. ౫

సుమం:—(తనలో) ఆహా! మహారాజు దూరదృష్టి! (ప్రకాశముగా) నీ విపు డన్నట్లే సర్వము రామపరవశ మగును. దాని కధికముగనే కూడ జరుగఁగలదు. (ముందు చూచి) మహారాజా ! రాణులు మువ్వురు సపరివారముగా నిటకు విచ్చేసి యున్నారు.

రాజు:—నీ వేఁగి రమ్ము. నేను చెప్పినది మఱచిపోకుము.

సుమం:—చిత్తము. (నిష్క్రమించును.)

రాజు:—సపరివారముగా మువ్వురు రాణులు నిటకు విచ్చేసి యున్నారు. ఇపు డీగ్రీష్మోద్యానమునకు వా రందఱును రాఁదగినదిగాఁ జెప్పియుంటినిగదా ! (నిరూపించి) ముందు కౌసల్య

మ. రమణీయద్యుతిరత్నధారణమహారమ్యాంగి, జ్యేష్ఠాంగనా
రమ, దివ్యప్రసవాభ పూజ్యయగు నీ రామన్ గణింపందగున్
సమదం బౌసుకుమారదేహ యయిన న్బాలించునాజ్ఞన్ హృద
బ్జములోనన్నను నిల్పు నెప్పుడుమహాభావాత్మయూహింపఁగన్.

తరువాత సుమిత్ర

మ. వ్రతనియమావళీకృశశుభంయులతాలలితాంగి, సర్వస
న్నుత సుగుణాఢ్య యెంతయు మనోహర మావదనేందుబింబస
ద్యుతి నిజదేహయష్టిపయిఁదోఁపఁగఁ జేయుమహాభ, శాంతిదే
వత, మృదుభాషిణీమణి శుభప్రద దేవి సుమిత్ర చూడఁగన్.

ఇఁకఁ గైకేయి

చ. కమలవనంబుమధ్యమునఁగ్రమముగా వెలుఁగొందుసూర్యబిం
బముఁ బురుడించునీమె, తలఁపం గడుఁగున్ నిరతంబు మద్వర
క్రమమును, సన్నిధానమునఁ గన్పడునట్టిసపత్నులన్ తృణో
పమముగఁ జూచు, సింహగతి వర్తిలు జీరికిఁగోక లోకమున్.

వీరిలో,

క. తొలిమహిషి రామజననియు
విలసచ్ఛుభలక్షణాంగి విశ్రుతనయసం
కలిత సగర్వయు నగుకో
సలరాజాత్మజయె నిత్యసమ్మాన్య యగున్. ౯

కాని,

గీ. దురభిమానరోషములు మందునకుఁ గొనదు
సర్వమిత్ర సుమిత్ర యా సత్య మరయ,
ఆత్మకామానుసారిణి యహరహంబు
నాయెడంద జయించిననాతి యామె. ౧౦

కైకేయియో,

క. ఏకరణి వచ్చుచుండునొ
యీకాంతకు ముక్కునందె యెసఁగును రుష యం
తే కాని విక్రమాన్విత
నాకష్టముఁ బాపి కాచినది మున్ను నన్. ౧౧

అందుచే,

సీ. ఈమనోరోషము పరిగణించియుంపరాని
దగును శౌర్యప్రణయశీల యగుట; నిదియుఁ
దలఁప ఛందోనుబద్ధవృత్తంబురీతి
శీఘ్రముననే ప్రసాదసంసిద్ధిఁ గూర్చు. ౧౨

[అంత ముప్పురురాణులు పరిజనులతోఁ బ్రవేశింతురు]

**అందఱు:**—జయము మహారాజా!

రాజు:—రాణులకు స్వాగతము. రండు. ఈమణిశిఖచిత్రశిలాతలమునఁ గూర్చుండుఁడు.

**అందఱు:**—(కూర్చుందురు)

రాజు:—పరిజనులారా! మీరు మీగృహముల కేఁగి విశ్రమింపుఁడు.

పరిజనులు: (నవ్వుచు) చిత్తము. మహారాజా! (నిష్క్రమింతురు)

రాజు:—ఈమండు వేసవిమట్టమధ్యాహ్నమం దైన, ఈయుద్యానమెంత చల్లగా నున్నదో చూడుఁడు.

చ. భవనమృగంబు లెల్లఁ దరుపంక్తులనీడలఁ గూర్కవెట్టెడుఁ
బ్రవిమలవాపికాస్త్రిమితవారిని హంసలు కృత్రిమంబు లా
పవిదినిదోఁచుఁ; గోఁటులిటఁ బాదపశాఖలఁ జక్రమించు, గా
దవులఁ గలట్టిపక్షు లిటఁ దారసిలుఁ సమశైత్య మందఁగన్.

కౌస:—ఈయుద్యానము నేత్రానందదాయకముగా నున్నది. ఇచట నే నిపు డనుభవించుచున్న సుఖము నిదివఱ కెన్నఁడు ననుభవింప లేదు.

రాజు:—కాలము ననుసరించియే సుఖము కాని దుఃఖము కాని కలుగును.

క. చన్నీటఁ స్నానము సం
పన్నము వేసవిని, కాని మఱి సీతున నా
పన్నము కావునఁ గాలమె
యెన్నఁగ సుఖదుఃఖవితతి నిచ్చు నరులకున్. ౧౪

కైకే:—ఆర్యపుత్రా! ఈకాలమున నే మేమిచేయవలయు నని మీ కోరిక ?

కౌస:—(తనలో) బాగుగా నున్నది. ఈమెమాట లాజ్ఞలవలెఁ దోఁచును.

రాజు:—ఈయుద్యానరమణీయతం దిలకింపఁ జేయుటకే నేను మిమ్మిటకు రప్పించితిని. ఈచెట్టునీడను జల్లగాఁ గూర్చుండి స్వేచ్ఛగా మాటాడుకొందము.

రాణులు:—సంతోషము.

రాజు:—బిడ్డల కుపనయనములు చేసితిమి. పదునైదేండ్లు వచ్చినవి.

కైకే:—ఔను.

రాజు:—అందఱును గుణాశ్రయు లగువీరు తే.

కౌస:—(తనలో) రాముఁడే సర్వగుణాకరుఁడు; రాజ్యయోగ్యుఁడు.

కైకే:—పితృకులముకూడఁ దక్కువది కాదుకదా!

రాజు:—నిజమే. కాని

చ. ఎవఁడు స్వకీయసద్గుణసుకృత్యములన్ బితృవంశదీపకుం
డవు నతఁడో ననింద్యుఁడు మహాత్ముఁ డెవం డగు నట్టిసత్సుత
ప్రవరుఁ డొసంగఁజాలుఁ బితృవంశ్యులకున్సుగతు ల్తదన్యుఁడిం
కవును భరాయమానతనుఁ డాతఁడగున్విగుణుండుమూఢఁగన్.

ఇంతవఱకు వీ రందఱు నుత్తములే. అందుచే నందఱి యందును నీకు సమానప్రేమము గలదు.

కౌస:—(తనలో) నాకుమాత్రము రాముఁ డన్ననే యెక్కువ మక్కువ.

సుమి:—జన్మక్రమమునుబట్టియే నాప్రేమభేదము.

కైకే:—నాకు గుణాధికునిపై నెక్కువమక్కువ.

రాజు:—గుణాధికుఁ డెవఁడు ?

కౌస:—(తనలో) రాముఁడే.

కైకే:—అవసరమైనపుడు చెప్పెదను.

రాజు:—అందఱు నాదాయభాగమున కర్హులే.

సుమి:—దాయవస్తువులలో శ్రేష్ఠ మేదో యది జ్యేష్ఠునికే రావలయు నని మనువు చెప్పినాఁడు.

కౌస:—(సంతోషమునఁ దనలో) మహారాజు దాయవస్తువులలో రాజ్యమే శ్రేష్ఠము.

రాజు:—ఆచారవిషయమున మనువు ప్రమాణము. రాజధర్మ విషయమున వాసిష్ఠ మెక్కువప్రమాణము.

కైకే:—వాసిష్ఠ మేమనును ?

కౌస:—(తనలో) రామునికే రాజ్య మిమ్మని.

రాజు:—వాసిష్ఠమున నిట్లు కలదు.

చ. ధనకనకాదుల న్సుతులు తాము సమానతఁ బంచుకోఁదగు
న్వినయగుణాకరాత్ముఁడు కనిష్ఠుఁడునయ్యు గురుండుకాఁదగుఁ
అనుపమశూరుఁడే కొనఁగనౌను చమూపతిత న్వయోగుణం
బున నది కాదు, యోగ్యుఁ డగుపుత్త్రుఁడె రాజ్యముఁ
గైకొనం దగుఁ. ౧౭

కైకే:—యోగ్యత ప్రతిపురుషునిదృష్టిని భిన్నముగా నుండును. ఒకని మనసునకు యోగ్యముగాఁ దోఁచునదే మఱియొకని కయోగ్యముగాఁ దోఁచును.

రాజు:—(తనలో) ఏదోవ్యాజమున నాకోరికకు విరుద్ధభావమును బైకిఁ జూపి కార్యసిద్ధి నందుదును. (ప్రకాశముగా) కుమారులు నలువురు యోగ్యులే. రాజ్యమును నాలుగుభాగములుచేసి యొక్కొక్కని కొక్కొక్కభాగ మిచ్చెదను.

కౌస:—(తనలో) రాజ్య మంతయు రామునికే యీఁదగును.

కైకే:—ఏమి? ఇదికూడ వాసిష్ఠమతమే యగునా? ఇట్టి దేదైన నాప్తవచన మున్న దానికి వాసిష్ఠము ప్రమాణము కాఁజాలదు. మఱియొక కుమారుఁడు కలిగిన మరల సామ్రాజ్యవిభాగమా?

రాజు:—మఱి రాజ్య మెవ్వరి కీయఁదగును?

కైకే:—యోగ్యతమునకు.

రాజు:—(తనలో) ఇప్పుడే సర్వము చెప్పెదను. (ప్రకాశముగా, కైకేయితో) మనవివాహకాలమున నేను నీ కిచ్చినవాగ్దానముమాట జ్ఞప్తి యున్నదా?

కైకే:—అంతయు జ్ఞప్తి యున్నది.

రాజు:—అందుచే భరతుఁడే రాజ్యదాయార్హుఁడు.

కైకే:—ఏస్త్రీయుఁ బుత్త్రునకు రాజ్యలాభ మన్న సంతోషింపక పోదు.

కౌస:—(తనలో) ఈమాట వజ్రపాతసదృశము. (మూర్ఛిల్లును)

సుమి:—మహారాజా! రక్షింపుము. రక్షింపుము. కౌసల్య మూర్ఛిల్లినది.

[రాజుపైబట్టతో విసరును. కైకేయి పుష్కరిణినుండి జలము తెచ్చి ముఖముపైఁ జల్లును. సుమిత్ర కాలుసేతులు రాయును.]

సుమి:— దేవి ! ఊఁజడిల్లుము.

(కౌసల్యకు స్పృహ వచ్చును.)

రాజు:— దేవీ ! ఏల మూర్ఛిల్లితివి ?

కౌస:—మధ్యాహ్న వేళ యిటకు వచ్చుటచే నెండదెబ్బ తగిలినది.

రాజు:—(తనలో) రాణిదుఃఖకారణము కౌశలముకుగాండ బోధపడినవి.

సుమి:—మహారాజా ! వివాహకాలమునఁ జేసినప్రతిజ్ఞ ననుసరించి భరతుఁడు రాజగును. జ్యేష్ఠుఁ డగుటవలన రాముఁడు రాజగును. వారిరువురకుఁ జెరిసగము రాజ్య మీఁ దగును.

రాజు:—నీపుత్త్రులకే మిమ్మందువు ?

సుమి:—ఏమియు వలదు.

ఉ. రాముఁడు రాజ్యమేల గుణరత్నము లక్ష్మణుఁ డేను గొల్చుమా
భూమిపు, బిడ్డ లిర్వురును బొందుదు రున్నతసౌఖ్యసంపదల్,
భూమిపుఁ డందు శత్రుభయముల్ జనపాలనభార మందుచే
మేము శమంబె కోరుదుము మిక్కిలి సేవకు సత్ఫలంబుగన్.

రాజు: కైకే:—ఆహా ! దేవి మహాత్యాగము ! సంతోషము ! లౌల్యరాహిత్యము !

కౌస:—(తనలో) ఈమె యసంతోష మేమియనర్థము కలుగఁజేయునో యెఱుఁగను. (ప్రకాశముగా) సపత్ని యెంత మహానుభావురాలు !

రాజు:—తల్లిగుణములు కొడుకులకు వచ్చునందురు. ఇట్టి యీమెపుత్రులే భ్రాతృసేవాదక్షభూతు లగుపుత్రులు. ఈమె ధన్యురాలు.

సుమి:—నాకుఁ గావలసినది లభించినది.

గీ. మానినియుఁ గాదు వ్యవహారమహిత కాదు
వాక్చతుర కాదు సత్కళావతియుఁ గాదు
ధన్య యగుకాంత, తలఁప భర్తయు సతులయు
సవతులయు మెప్పు నందెడుసతియె కాని. ౧౮

రాజు:—ఇంతకు రాజ్యయోగ్యుఁ డెవఁడు ?

కైకే:—నామాట పాటించు వాఁడె రాముఁడే రాజ్యార్హుఁడు.

కౌస:—(హర్షముతో) సంతోషము. సంతోషము.

సుమి:—నామనసున నెట్లున్నదో కైకేయి యట్లే పలికినది.

రాజు:—వివాహకాలమున నేను జేసినప్రతిజ్ఞగతి యేమి ?

కైకే:—శుభగతియే.

రాజు:—ప్రతిజ్ఞాహాని పాతక మనియే యెల్లరిసంప్రదాయమును.

కైకే:—నీవంటిరాజర్షులకుఁ బ్రతిజ్ఞాహాని యనర్థకరమే.

గీ. స్వసుఖనాశంబుఁ గల్గుపక్షమునఁగూడ
తప్పఁగారాదు ప్రతిన యెంతటివనుకు
ఉత్తములమార్గ మిది యగు నూహసేయు
నీవు నామార్గమును వీడఁ బోవుకాదె ! ౧౯

కౌస:=(తలలో) అయ్యో ! వజ్రపాతము !

రాజు:—నిజమే.

గీ. ప్రజలసౌఖ్యంబుకోసమే ప్రతిన నీవు
దాఁటఁ జూతువు కాని స్వార్థమునఁ గాదు

ప్రతిన తప్పుటవలన లనంబుకూడఁ
బాప మంటదుగద ! మహాభాగ ! నీకు. ౨౦

మఱియు,

సీ. గుణులలోపల రాముఁడే గుణివరుండు
పాలనార్హుండు శతమన్యుపగిది నతఁడె,
భువనసంరక్షణార్థమై యవతరించె
విష్ణుపగిదిని విఖ్యాతవీరుఁ డతఁడు. ౨౧

ఒకకార్యమును విచారించునపుడు కారణప్రాధాన్యము నుపేక్షింపరాదు. నన్ను సంతోషపెట్టుటకే నాకుమారునికే రాజ్యదాయ మిత్తు నని నీ వానాఁడు పలికితివి. రామునికి రాజ్యదానము చేయుటవలన నేను ప్రసన్న నగుదును. భరతునికి రాజ్య మిచ్చిన నా కెంతయో రామునికిచ్చిన నంతయే.

రాజు:—భరతుఁడును గుణవంతుఁడు రాజ్యార్హుఁడు కదా !

కైకే:—ఔను. కాని,

సీ. అగుణవంతునికంటె మే లగును సుగుణి
గుణుల గుణవత్తరుఁడు మేలు కోటిరెట్లు
భాస్వరం బయి వెలుఁగు దీపంబు రాత్రి
కాని యది యెంత మధ్యాహ్నభానుముందు. ౨౨

వేయేల ?

క. భరతుఁడు గుణి యగు గుణవ
త్తరుఁ డగు రాముండు కానఁ దగు నతఁడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతఁ డతనికన్నఁ బరముఁడు కలఁడే ? ౨౩

కౌస:—సంతోషము. సంతోషము.

సుమి:—ఆహా! సపత్ని కైకేయి మహానుభావయు నీతిజ్ఞయు.

రాజు:—మేఘములు గర్జించిననే కాని యమృతవృష్టి కలుగదు.

కైకే:—ఆర్యపుత్రా! ప్రణయసమయముననైన నిర్వ్యాజముగా నేను సత్యమే చెప్పుదును. అదియే ఘనగర్జనము. అయుక్తముమాత్ర మెన్నఁడును బలుకను. అదియే యమృతవృష్టి. ఏలన,

గీ. అమృతవర్షము కురిసెడునట్టిమేఘ
మెపుడు వర్షించు సహజపూావృత్తిఁ గోడ
దానిమార్గనిరోధంబు తనరె నేని
అశనికూడను వర్షించు నది నిజంబు. ౨౮

రాజు:—(తనలో)ఈమాటవలన నెవ్వరికైనను భయమే కలుగును. ఐనను, ఈదేవి క్షణకోపప్రసాదముల నెఱిఁగిన నా కెట్టి శంకయు లేదు. (ప్రకాశముగా) సమయము వచ్చుసరికి నాయాత్మజులలో నొకఁడు రా జగును. ఆతఁ డుత్తమముగా రాజ్య మేలుచుండ సర్వము సర్వసుఖావహము కాఁగలదు.

కైకే:—ఆర్యపుత్రా! ఇప్పుడు మనము నిశ్చయించుకొన్నట్లే జరుగఁగలదు. మన మట్లే తప్పక యొనరింతము.

కౌస:—మహారాజా! సాయంక్రీడల కేఁగినకుమారులు నలువురు జ్యేష్ఠ నగునాకు నమస్కరింప వచ్చియుందురు. వారిని సంభావింప నే నేఁగి వచ్చెదను.

సుమి:—కుమారు లందఱు తల్లు లెల్లరకు సాయాహ్నమున నమ

సత్కరింతురు. వారి మనస్సులలో జ్యేష్ఠకనిష్ఠభావము లేనే లేదు.

కైకే:—నేనును బోయి వచ్చెదను.

రాజు:—మంచిది.

రాణులు:—(రాజునకు నమస్కరించి నిష్క్రమింతురు.)

రాజు:—

చ. ముదిమిఁగలంగుమానసము మోదమునందు నొకొక్కవేళ ని
మ్ముదితల వేఱువేఱుగుణముల్ కన; లోకులు భిన్నమానసు
ల్పదుగుర కుండ దొక్కరుచి; వర్తిలు జ్యేష్ఠకు జ్యేష్ఠపుత్త్రుపై
మది; కడు నీర్ష్య కైక; కిటుఁ మాటికి దుఃఖము కల్గు నింటిలో.

క. బహుభార్యాత్వము నరునకు
బహుదుఃఖావహము; ప్రేమభావము సమమై
విహరించుచున్నఁ గానీ
బహుమానసరుజ లొసంగి బాధించు నరున్. ౨౬

ఎవ రక్కడ ?

ప్రతీహారి:—(ప్రవేశించి) మహారాజా ! జయము. ఏమి సెలవు ?

రాజు:—విజయా ! సుమంత్రుని బిలువుము.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించి సుమంత్రునితోఁ బ్రవేశించి) ఆర్యా ! ఇటు. ఇటు.

సుమం:—మహారాజా ! జయము.

రాజు:—అమాత్యా ! స్వాగతము. రమ్ము. కూర్చుండుము. విజయా ! నీవు బయటి కేఁగి కూర్చుండుము.

ప్రతీ:—చిత్తము. (నిష్క్రమించును.)

సుమం:—ఏమి సెలవు ?

రాజు:- నే నిప్పుడు కైకేయి మహానుభావత, సుమిత్ర యలోలుపత తెలిసికొంటిని.

సుమం:- ఎట్లు ?

రాజు:- కైకేయితనయునికే రాజ్య మిచ్చెద నన్న నాప్రతిజ్ఞ యున్నను, ఆమె గుణవత్తరునకు రాజ్య మీఁదగు నన్న న్యాయముచే రామునికే దానిని విడిచిపెట్టినది. ఇఁక, సుమిత్ర తనసుతులతో రామసేవామగ్నతఁ గోరుకొన్నది. వీరిమహానుభావత పరమాశ్చర్యకరముగదా!

సుమం:- ఔను. కాని,

ఉ. భావిసుఖావహం బయినభంగి మనీషులు మంచిచేష్టలన్
భావనచేసి న్యాయముగ వర్తిలి కాంతురు సర్వసౌఖ్యముల్;
దైవవశంబు సర్వమును దాఁటఁగఁజాలరు దాని నెవ్వరున్;
జీవి పురాకృతంపుఫల సిద్ధి నిటన్ గుడుచున్ విధిక్రియన్.

అందుచే,

ఉ. పుత్త్రులు నల్వురున్ సుగుణపుంజము లద్భుతసూరిశేఖరుల్
గాత్రము లన్ని వేఱయినఁ గాని మనస్సులు చూడ నొక్కటే
మాత్రము ప్రేమభంగమునుమాత్రము కల్గఁగనీదు రాజ్యమీ
పుత్త్రుల; కెంతవాఁడి యగుముల్లును నీళులఁ జిల్లుపుచ్చునే ?

కనుక, నీవు రాజ్యప్రదానచింతను విడువుము. రాముఁడు రాజైనచో రాణులుమాత్రము సంతసింపరా ?

రాజు:- నిజము. నా కిఁక నెట్టిచింతయును లేదు.

సుమం:- వసిష్ఠభగవాను లిట్లు విన్నవించిరి.

రాజు:- గురుభగవాను లేమని సెలవిచ్చిరి ?

సుమం:- ఇట్లని. కుమారులు

ఉ. వేదము లెల్ల నేర్చిరి వివేకమునన్ శుభవిద్య లెల్ల న
త్యాదృతి నభ్యసించిరి కుశాగ్రమతుల్ మఱి వీరి కెల్ల నీ
మీఁదట నస్త్రశస్త్రము లమేయనృపోచితసర్వధర్మముల్
మోదము మీఱ నేర్పువిధమున్నృపచంద్రమ! చూడఁగాఁదగున్.

విదూ:—(తొందరగాఁ బ్రవేశించి) ఓయీ వయస్యా! ప్రతీహారులు నన్ను రానీయకపోఁగా వారితోఁ బోరాడి నీ కొకప్రియ విశేషము చెప్పుటకై యిట వచ్చిపడితిని.

రాజు:—ఏమి ప్రియము?

విదూ:—రామునకు రాజ్యాభిషేక మగు నని కౌసల్య నా కెన్నో మోదకములు పెట్టెద నని వాగ్దానము చేసినది. ఈసంగతి యంతయు నీకు నివేదించుటవలన నాహృదయ భారము తగ్గి తేలిక యైనది.

రాజు:—ప్రతిదినము నీవు మోదకములే తిందువులే. రాముఁడు రాజైనను భరతుఁడు రాజైనను నీకు మోదకములకు మాత్రము లోటుండదు. చింతిల్లకు.

విదూ:—ఏల చింతింపను? రాముఁడు రాజైనచో, కౌసల్యా దేవి బహుమోదకములచే నన్నుఁ బ్రీతునిఁ జేయును. భరతుఁడు రాజైనచో కైకేయి బహుతరమోదకములచే నన్ను సంతుష్టునిఁ జేయును.

సుమం:—వసిష్ఠభగవానులతో నేమని నివేదింతును?

విదూ:—(జనాంతికముగా) అమాత్యా! నావయస్యునికిఁ గోపము తెప్పించుటకై నేను గొంచెము మాటాడెదను. నీ వేమియుననుకొనకుము. (రాజుతో) నేను మోదకముల తో సంతోషింపనంతవఱకు నభిషేక విధి ప్రారంభింప

రాదని వసిష్ఠులతోఁ జెప్పెదను.

రాజు:—సుమంత్రా! భగవానులు గురుపాదులు నగువసిష్ఠులతో శీఘ్రముసే తాము సెలవిచ్చినప్రకారమే చేయుదు నని నివేదించి రమ్ము.

విదూ:—(అపవారించి) వయస్యునకు క్షోభ కలిగింతును. (ప్రకాశము) నాకుఁ దెలియనివిషయము మీరు మాటాడుచున్నారు. నాకు మీరు చెప్పరు. ఐనను, నా కిపు డది తెలిసినది. భరతుని కీయవలసినరాజ్యము నా చెలికాఁడు రామున కిచ్చుచున్నాఁడు. నే నంతఃపురమున రాణులకు బయట నన్నదమ్ములకుఁ బోరాటము కల్పింతును. లేనిచోఁ, బ్రాయోపవేశము చేయుదు నని యందఱను భయపెట్టెదను.

రాజు:—అమాత్యా! నేను జెప్పినది భగవానులతోఁ జెప్పిరమ్ము.

సుమం:—చిత్తము. (నిష్క్రమించును.)

విదూ:—ఈకపటపండితుఁ డిప్పటికి వెళ్ళినాఁడు.

రాజు:—(తనలో) చపలుఁ డగునీవటువు కలహప్రియుఁడు. ఆకలహమువలనిఫల మెఱుంగఁడు. మూర్ఖజనిత మైనను, ఇట్టిక్షోభము శంకను గలిగించును. కానిమ్ము. (ప్రకాశముగా) సఖా! సుందరకా! ఏదో కథాప్రసంగమున రాజ్యదాయవిచారము కలిగినది. ఈప్రసంగమున నెవ్వరి మాటలుకూడ యథార్థములు కావుసుమా!

గీ. అధికవిప్లవకర మైనయానృపత్వ
మేడ? సుకుమారచేతస్కుఁ డీమదీయ
పుత్త్రుఁ డేడ? పరిహాసపూర్వకోక్తి
యిదియె సత్యంబెకా మది నెంచకయ్య!

విదూ:—మీరు నిత్యము నిట్లే మాటాడుకొనుచుందురా?

[తెరలో]

ఉ. శక్రపురిన్ జయించి సురసంఘముఁ ద్రోలి నలంచి వీరరా
ట్చక్రము రావణాసురుఁడు శాంతిగడించియు నేఁడు వెండియు
న్విక్రమశీలబాలరఘువీరకథన్ విని శంకమానుఁడై
వక్రగతిన్ నిగూఢుఁడయి వచ్చెడి నేమఱకుండుఁ డెల్లరున్.

రాజు:—(విని) ఓహో! ప్రధానచారుఁ డగు సుబుద్ధిస్వనమువలె నున్నది. సుందరకా! నీవు పోయి నావచనముగా నాతనితో "నీమాట వింటిమి. సంగతి తెలిసిన" దని చెప్పి రమ్ము.

విదూ:—బాబో! నేను వెళ్ళను. దారిలో నేనే రాముఁడ ననుకొని యీ రావణుఁడు నన్ను మ్రింగివేయఁగలఁడు.

రాజు:—సరే. నేనే వెళ్ళెదను. (తనలో)

క. ఒకశంక నివృత్తం బిం
కొక టుద్భూతంబు నయ్యె నొకదుఃఖమె నా
కకటా! కొడుకులు లేమిన్
వికలత హృది కయ్యె నిపుడు వేయివిధములన్. ౩౧

ఆహా!

చ. సుతులు జనించినారు వరశూరు లటంచును వ్యాప్తిఁ జెందె ది
క్తతి నపుడే విరోధులును దాదవులన్ దలయెత్తఁ జొచ్చి రీ
సుతు లతిబాలకుల్; తలఁప శూరుఁడ నయ్యును వృద్ధనైతి నే
నతిబలవంతు లుద్ధతు లహా! యరు, లింక శరణ్య మీశుఁడే.

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

[సరయూతీరమునఁ గ్రీడించుచు నిరువురు గంధర్వులు ప్రవేశింతురు.]

చిత్రకేతువు:—చిత్రపదా! నీ వీజలముల స్నానము చేయు నుత్సాహమున నీకర్తవ్యమునే మఱచితివి. మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్రపదుఁడు:—తెలియ కేమి? అంతయుఁ దెలియును. రావణుఁడు రామునకు నీతైన నసిష్టము చేయుటకు నిగూఢరూప చ్ఛాయతో నయోధ్యాప్రాసాదసమీపమునఁ దిరుగు చున్నాఁడు. మహేంద్రునియాజ్ఞను రాముని సంరక్షింపఁ గుబేరునిపంపున మన మిటకు వచ్చినారము. కాని,

చ. హిమగిరినీరసౌఖ్య మొకయింతయు దీటగునే? తలంప ను
త్తమదివిజాపగాజలము తక్కినదివ్యజలంబు లింతయుక్
సమమగునే కనుంగొనఁ బ్రశస్తము నో సరయూజలంబుతో?
సుమహిత మిందు స్నాన మొనరించిన నాకు మహాసుఖం
బగున్. ౧

చిత్రకే:—హిమాధికప్రదేశమునుండియే మనము వచ్చితిమి కదా! పోనిమ్ము. ఇది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే. మఱి స్వామినియోగము మఱవఁ గూడదుకదా!

చిత్రప:—ఔను. కాని,

గీ. నిఖిలఋతువుల బహురమణీయ మగుచు
సకలదేవర్షిమనుజప్రశంసితంబు
నైనసరయూజలంబు పాపౌఘ మడఁచు
గ్రీష్మశిశిరర్తువుల సమక్షేమ మొసఁగు. ౨

ఏమైనను నేను స్వామినియోగము మఱవ లేదు. అప రాహ్ణామునకుఁ బూర్వమే రావణుఁ డెట్లయోధ్యకు రాఁగలఁడు? పుష్పకమున వచ్చిన నంతత్వరగా రా లేఁడుకదా! ఇంతకు సింద్రాదులచే తమభార్యలను రక్షించుకొనుటకైనను శక్తులు కానపుడు రావణుని బారినుండి రాముని రక్షింప మనకు సాధ్యమా? అ ట్లని ప్రభునియోగ ముపేక్షింతు మని కాదు. గూఢ దేహులమై యీప్రాసాదోపవనమున నిరీక్షింతము. రమ్ము.

చిత్రకే:—అట్లనకుము. రావణుఁడు దశరథునికంటెబలవత్తరుఁడే యైనచో నేల యాతఁడు నిగూఢముగా వచ్చును? కావున, రామునికుపద్రవము సంభవించు నని తోఁచిన వెంటనే మనము దశరథునకుఁ దెలుపుదము.

చిత్రప:—కాదు. కాదు. రావణుఁ డద్వితీయబలవంతుఁడు. మఱి,

క. చోరులు శఠులును వ్యసనులు
ధారుణి బలవంతు లయ్యుఁ దగ నిర్భయులై
యూరక ప్రత్యక్షముగాఁ
గ్రూరము లగుపను లొనర్పఁ గోరరు మదులన్. 3

చిత్రకే:—ఏమైనను, అనిష్టప్రతీకారోపాయ మున్నదికదా!
చిత్రప:—సరే. రమ్ము. పోదము.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

# యజ్ఞఫలము

## తృతీయాంకము

[ఆకాశమార్గమున రావణుఁడు ప్రవేశించును]

రావ:—ఆహా!

గీ. పుట్టినాఁడఁ బులస్త్యర్షి పూతకులము
నందు, నందితి శివుఁ గొల్చి యమితబలము,
సురల గెల్చితిఁ, గొంటి దాసులుగ నసుర
వల్లభుల, దుర్జయుండ రావణుఁడ నేను. ౧

గీ. సాటిలేనిది కులబలశౌర్యగరిమ
దుర్గమై యొప్పు నబ్ధియందునఁ బురంబు
ఇట్టిభాగ్యాస్పదునకు నా కిలను బరుల
పౌరుషాటోపములు సైఁపవచ్చు నెట్లు? ౨

సీ. దశరథావనిపాలుతనయుఁ డంట ప్రసిద్ధ
రామాభిధానవిభ్రాజితుఁ డఁట
శస్త్రాస్త్రవిదుఁ డంట సమరంబునందు సు
రాసురగణముల నైన లీల
గెలువ శక్తుం డఁట తలఁప బాలుం డైన
నుత్తమయోధుఁడై యొప్పు నంట
అని జనంబులు చెప్ప విని యాతఁ డెట్టిఁడో
చూడంగ వచ్చితిఁ జోద్యము గను

గీ. అట్టిమత్తుఁడు బలవంతుఁ డైనవాఁడు
నరులలోపలఁ గలఁడె? ఉన్నట్టియెడల
నతని జీవింపనిత్తునే యవనిపయిని?
అందుకొఱకైనదే మదీయాగమంబు. ౩

చ. వారికినదేని నాకొరులకైనను నేల క్షణంబులోన నా
పురమున కాదురాష్ట్రఁ గొనిపోవుదు నక్కడఁ జూడఁ గందునా
సరునిబలంబు పెక్కువ యనంతర మాతనిబంధనంబొ దు
ష్కరవధయో విమోక్షమొ తగన్నచరింతు యథోచితంబుగన్.

మంత్రప్రభావమున నిగూఢరూపముతో నాకాశజల పర్వతతుల్యగతిని జరించునారథము నెవ్వరును గనఁ జాలరు. దీని నిట నుంచి ప్రాసాదమున కేఁగి చూచెదను. (నిష్క్రమించును)

[అంత విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

విశ్వా:—

మ. మును క్షాత్త్రోచిత తేజమందఁ బరమామోఘాస్త్రసంఘాతము
ల్లను నిర్జింపఁగఁ జాలవయ్యె నిపుడు బ్రహ్మాస్త్రముం గాంచ దే
వనికాయాస్త్రము లెల్లవమ్మె యగు నాపై నట్టిన న్బోల్నిరీ
హుని తేజస్విని శక్తియుక్తుఁ గననో నొక్కొ జగంబందునన్?

గీ. అతిబలోపేతజృంభకాస్త్రాదు లెల్ల
నెవ్వఁ డెఱుఁగును ధరణిలో నేను గాక
ఈమహాస్త్రమ్ములను గ్రహియించుసుకృతి
యబ్బునే యని చింతింతు నహరహంబు. ౬

చ. అతిబలవీరుఁడున్ దశరథాత్మజుఁడున్ రఘురామనాముఁ డు
న్నతబలశాలి యయ్యును ఘనం బగు దాంతి గలాఁడటన్న సం

గతి విని వచ్చినాఁడఁ గనఁగా నతనిఁ గని సత్యమేని స
న్నుతముగ నొజ్జనై యొసఁగుదు రఘురామునికి నస్త్రవిద్యలన్.

క. ధరణీపతి పృష్టుండు ద
శరథుని యాచించి రామచంద్రుని గొని సం
బరమున నాశ్రమపదమున
కరిగి మదీప్సితఫలంబు నందెదఁ బిదపన్.

(ముందు చూచి) ఏమి? రావణుఁ డాకాశమునుండి భూమికి దిగుచున్నాఁడు! చూచుచుండఁగనే వీఁడు తిరస్కరిణీవిద్యవలన రథముతోఁ గూడ నంతర్హితుఁ డయ్యెను. తిరస్కరిణీపిహితుఁ డయ్యును వీఁడు నాకుఁ గాన్పించుచునే యున్నాఁడు. కానిమ్ము. ఈదుర్మార్గుఁ డేమి చేయఁ దలఁచెనో నిగూఢదేహుఁడనై కనిపెట్టెదను. వీఁడు వచ్చిన చోటఁ దప్పక యకార్య మొనరించి తీరును.

రావణుఁడు:—(ప్రవేశించి) ఏమి? విశ్వామిత్రుఁ డిటకు వచ్చినాఁడే! ఈతఁడు బ్రహ్మక్షత్త్రతేజోరాశి. నాకోరిక నీతఁడు సాగనీయఁడు. నేనును దుర్ధరుఁడ నగురావణుఁడ నగుటచే నతఁడు నా కేయనిష్టమును జేయలేఁడు. నావలె నీతఁడును నిగూఢరూపముననే చరించుచున్నాఁడు. కానిమ్ము. నాప్రభావమున నీతని నిగూఢరూపమును జూడఁగలను.

విశ్వామిత్రరావణులు:—(ఎవరికి వారే తమలో) నేను జూచుచున్నాను. కాని, యీతఁడు నన్నుఁ జూచుట లేదు.
(ముందు చూచి) వసిష్ఠునితోఁ గూడి కుమారు లిటకే వచ్చు

చున్నారు.

[అంత వసిష్ఠుఁడు నలుపురుకుమారులు ప్రవేశింతురు]

వసి:—దీర్ఘాయుష్మంతు లగుకుమారులారా!

చ. కఱపితి నెల్లవిద్యలను గంటిరి మీరు యథాక్రమంబుగా
మఱపొకయింత లేక శ్రుతమాత్రము చేఁ గ్రహియించియాత్మలన్
స్థిరపడునట్లు చేసికొని; చెందెను ధన్యత మద్గురుత్వమున్;
బరమసుఖప్రదంబు లగుఁ బాత్రుల కిచ్చెడు జ్ఞానసంపదల్.

క. దీపం బెట్టులు వే ఱగు
దీపంబుల వెలుఁగఁ జేయఁ దేజము సమహా
నాపగిదిని నస్మద్వి
ద్యాపరిణతి నాసమాను లైతిరి మీరున్. ౧౦

ఉ. నేను జనించి యున్నయల నీరజసూతికులంబురత్నముల్
హానివతంసులే పరమమాన్యత నేర్పఁగ సర్వశాస్త్రముల్
వానిఁ గ్రమమ్మునం బడసిపాత్రులు మీకు నొసంగినాఁడ నో
శ్రీనిధులార! రాజ్యసుఖసిద్ధి యొసంగును మీకు దీనిచే. ౧౧

కుమారులు:—భగవానునివలన సంస్కారము లందినమాకు సర్వము శుభోదర్కమగుట కెట్టిసందియమును లేదు. గురూత్తమా! ఇపుడు నగరబహిర్భాగమున కేఁగి మేము నేర్చినరీతి ధనుర్వేదవిద్యాభ్యాసము చేయఁ గుతూహలపడుచున్నాము. అనుగ్రహింతురుగాక!

వసి:—నేఁడు పాడ్యమి. కాన, అనధ్యాయము. మీయిష్టము వచ్చినచోటికి కేఁగుఁడు. నే ననధ్యాయకరణీయముల నిర్వర్తింతును. (నిష్క్రమింతురు)

రాము:—వత్సలారా! మనము పురమునకు దక్షిణముగా,

బోయి ధనుర్వాస్త్రలాఘవము నేర్చినరీతి నభ్యసింతము.

భర:—పార్శ్వానుచరులను బిలువనంపనా ?

రాము:—వలదు. నలువుర ముంటిమిగదా ! అడవి కేఁగ నల వాటు లేనివారము గాము. ఇంతకు దూరముగాఁ బోవుట లేదు. చేతులలో నస్త్రము లున్నవి. క్షత్రియోత్తము లాత్మశౌర్యసంరక్షితులుగదా !

(అందఱు నడతురు.)

శత్రు:—(తెరవంకఁ జూచి) మనము చెప్పకపోయినను మనగమ నము నెఱిఁగి పార్శ్వానుచరులు మనవెంట నంటి వచ్చు చున్నారు.

లక్ష్మ:—(తెర కెదురై) ఓపార్శ్వానుచరులారా ! మేము ధను ర్లాఘవ మభ్యసించుటకై వెళ్ళుచున్నాము. మీరు శ్రమపడి రా నక్కఱ లేదు. వచ్చినదారినే పొండు.

(అందఱు నడతురు)

రాము:—(వెనుదిరిగి చూచి) వీరు వెనుక కేఁగుట లేదు.

లక్ష్మ:—మీరు వెనుకకుఁ బోకుంటిరో నేను బాణము వేసి మిమ్ము వెనుకకుఁ బంపుదును. (వి ల్లెక్కిడును)

రాము:—వత్సా ! శాంతింపుము. వీరు స్నిగ్ధహృదయు లగు నాత్మీయులు. దండనార్హులు కారు. (తెర కెదురై) అను చరులారా ! మీరు వచ్చినచో నాపై నొట్టే. రా వలదు. మరలి పొండు.

భర:—అందఱును వెనుదిరిగి పోయినారు.

(అందఱును మరల నడతురు)

రాము:—ఇంకను నడచి యేమిలాభము ? ఇక్కడనే మన ధాను

ష్కృతి నారంభింతము. (అందఱు కూర్చుందురు)

శత్రు:—(లేచి)

మ. అదిగో ! పిప్పలవృక్షమందుఁ జలపత్రాళిక౯ సమస్తంబు నా
పొదిలో నున్న మహాశరం బొకటి సొంపుల్లుల్లుచుం బోయి ఛి
ద్రదశ౯ బొందఁగఁ జేసి తత్క్షణమె చేరం౯ వచ్చు స్వస్థాన మి
య్యది మీ రందఱుఁ గన్గొనుండు పరమాశ్చర్యంబు రేఁ
కెత్తఁగన్. ౧౭

(బాణము విడుచును)

రామభరతలక్ష్మణులు:—సెబాస్ ! వత్సా ! సెబాస్ !

భర:—దీర్ఘాయుష్కుఁడు శస్త్రవిదుఁడు నగుశత్రుఘ్నుఁడు చేసి నట్లు నే నింకొకవృక్షము నాకులఁ జేసెదను. (బాణ మేయును.)

రాము:—సెబాస్ ! వత్సా ! సెబాస్ ! నీధనుర్వేదకౌశలముఁ జక్కఁగాఁ జూపితివి.

లక్ష్మ:—(వి ల్లెక్కిడి)

శా. ఆమూలంబుగ వృక్షముం బెఱికి యత్యాశ్చర్యదం బొచు నె
న్నో మొక్కల్పొనరించి నైచి దిశలందుం జిమ్ము నాయమ్ము మీ
రామార్గంబునఁ జూచుచుండుఁడిదె నాయస్త్రమ్ము వెన్వెంట నే
భీమప్రౌఢిఁ గృతస్వకార్యమయి వేవేఁ జేరు మత్తూణముం౯.

మఱియు నింకొకబాణమున,

క. చలియించుచున్న మోదుగు
నిలుపుదు స్తంభంబు గాఁగ; నెఱి నున్నతమై
వెలసినపాషాణమ్మును
జలియింప నొనర్తుఁ దృణముచందము గాఁగన్. ౧౮

(బాణములు విడుచును) ఆహా! చూచితిరా?

క. వనమునఁ బక్షిగణంబులు
ఘనమృగసంఘములు భీతిఁ గని పొదవుల౯
జనుచున్నవి గతిలాఘవ
మునఁ గనురమణీయరూపములఁ గన్పడుచున్. ౧౫

భరతశత్రుఘ్నులు:—ఆహా! మహాభాగుని బాణక్షేపకౌశల మద్వితీయము.

రాము:—సెబాస్! వత్సా! సెబాస్!

గీ. కడఁగి దైవతదానవగణము నేని
నిర్భయమ్ముగ గెల్చెద నిన్నుఁ గూడి
యెప్పుడు నాచెంత వసియింతువేని నీవు
భీమమృత్యువునేని నిర్భీతి నడఁతు. ౧౬

లక్ష్మణభరతశత్రుఘ్నులు:—(బద్ధాంజలులై) ఆర్యా! నీవు జ్యేష్ఠుఁడవు. గుణాకరుఁడవు.

చ. గుణములచేత విద్య ననుకూలత మాన్యత మించునట్టి స
ద్గణములు నైజశక్తులను దాఁచి నుతింతు రలంతివారల౯

రాము:—

గుణములె శ్లాఘ్యముల్వయసు గొప్పకు రాదిల వృద్ధవృద్ధము
ల్మిణుఁగురు లార్పఁజాలునె తమిస్రము బాలఖగుండు లేనిచో?

భరతలక్ష్మణశత్రుఘ్నులు:—

క. నయమున విద్యల గుణమున
వయసునఁ దలపోయ నీవె వరణీయుఁడవై
ప్రియ మొనరింతువు మాలో

రాము:— ప్రియబంధువులందు గుణమె వెదకుదురు జనుల్.

భరతలక్ష్మణశత్రుఘ్నులు:-ఆర్యా! మాధనుర్వేదకౌశలమును జూచి మమ్ము స్తుతించితివి. నీనిపుణతను మేము కనఁ గోరుదుము.

రాము:-వత్సలారా!

గీ. జన్మసంస్కారవిద్యల సముల మైన
మనకు నెట్టులు గుణభేద మెనయుఁ జూడ

భర:- జన్మమాత్రంబుచేతను సమము లైన
ముత్తెముల నత్తిగుల్లలు పోలునొక్కొ? ౧౯

రాము:-సరే. మీరు నియోగింప నేను జూప నను టెట్లు? (తనలో) వత్సలప్రయోగనైపుణ్యమునే నేనును జూపుదును. అంతకంటె నెక్కువ చూపిన వారిని జిన్నఁ బుచ్చినట్లగును. (ప్రకాశముగా) వత్సా! శత్రుఘ్నా! నీవు చూపిన ధనుర్వేదకౌశలము నేను జూప యత్నింతును. (విల్లెక్కిడును.)

విశ్వామిత్రరావణులు:-(దూరమునఁ బ్రవేశించి ఎవరికి వారే తమలో) ఇతఁడే రాముఁడు.

చ. పరమవిశాలమున్ దృఢము వక్షము; నున్నత మంసభాగము
న్సురుచిరమా ముఖాంబుజము; శోభిత మానయనద్వయంబు; భీ
కర మరికోటి కెన్న విలుకానితనం బది; దేవదేవుఁ డౌ
హరియవతార మీతఁ డని యంటకు సంశయ మున్నె
చూడఁగన్. ౨౦

నే నీనిగూఢదేహముతోడనే నాబాణములతో రామబాణములు లక్ష్యమును జేరుటకుఁ బూర్వమే నడుమ ఖండించెదను. ఆతఁడు కోపిష్ఠియై యేమి చేయునో

చూచెదను. ఆతని పరాక్రమ మంతయు నపుడు పోడ
కట్టును.

సీ. అతనియస్త్రపరంపర నడఁచినంతఁ
జండరూపముఁ గొని తనశక్తిఁ జూపుఁ
గ్రీడయం దున్న శయనించి నీడ నున్న
సింహ మాత్మీయపౌరుషశ్రీలఁ గను నె? ౧౨

(నిష్క్రమింతురు.)

రాము:—వత్సలారా చూడుఁడు. ఆవృక్షపత్త్రము లన్నిటి
నొక్కమాఱుగాఁ జిల్లులుపుచ్చెదను. (బాణము విడిచి
యాశ్చర్యములో) ఏమి? గుఱి తప్పి నాబాణము మార్గ
మధ్యమున రెండుముక్కలై పడిపోయినది!

శత్రు:—అది ప్రాఁతబాణ మేమో?

లక్ష్మ:—అది విఱిగినబాణ మేమో?

భర:—దారిలో సుడిగాలి కల దేమో?

రాము:—కానిండు. మరల బాణము విడుతును. (శరము సంధిం
చును)

విశ్వామిత్రరావణులు:—(దూరమునఁ బ్రవేశించి తమలో) ఏమి! ఈ
రాముఁడు.

చ. అమలశరాపరాధజనితామితచండరుషావశాత్ముఁడై
కమలదళోపమంబు లగుకన్నుల నగ్నికణాళి రాల్చుచున్
శమము దొఱంగి భీకరదశన్ గనుపట్టెడుసింహ మట్లు లో
కములకు భీతిగొల్పు నధికంబుగ; వీని కసాధ్య మున్న దే?

రాము:—(మరల బాణము విడుచును)

అందఱు:—మరల నష్టే మైనదే!

రాము:- కానిండు. మహారాజు నా కనుగ్రహించినవాయవ్యా
స్త్రమును సమంత్రకముగా విడిచి యావృక్షమును వ్రేళ్ళ
తోఁ బెకలించి దూరముగాఁ బాఱవైచెదను.

విశ్వామిత్రరావణులు:-(దూరముగాఁ బ్రవేశించి) ఏమి! వాయ
వ్యాస్త్రమునుగూడ భగ్నము చేయవలయునా? అట్లే
యగుఁ గాక! (నిష్క్రమింతురు)

రాము:-(ధ్యానించి బాణము విడుచును)

అందఱు:-ఏమి! ఆచెట్టుఆకైనను గదలలేదే?

రాము:-గీ. ఔర! యీమారుతాస్త్రరహస్యములను
మున్ను పరికించి యుండ లే దెన్నిమాఱు!
వ్యర్థ మయ్యెను నేఁటి కిప్పుడి దైవ
వంచితుం డగువాని ప్రాభవమువోలె. —౭౩

(కోపముతో) కానిమ్ము.

మ. అమితం బైనప్రకాశముం గలుగునీయాగ్నేయదివ్యాస్త్రము
త్తమభంగిన్ దనుసంతతిన్ క్షణములో దగ్ధంబుగాఁ జేయుతన్
విమలాస్త్రం బటు చేయలేనియెడలన్ వెన్వెంటనే నాశరీ
రము భస్మం బొనరించు నైఁపుఁజన దస్త్రవ్యర్థభావం బికన్.

రావణుఁడు:-(దూరముగాఁ బ్రవేశించి తనలో) ఆహా!

గీ. సింహమును రెచ్చఁగొట్టి వీక్షించి యుంటి
నరసినాఁడ ధనుష్పాణి హరు మహోగ్రు
స్వాంతము చలించి యెఱుఁగ దీసజ్జశస్త్రి
బాలకుని జూడ గడగడ వడఁకఁ బుట్టె. —౭౪

ఆగ్నేయాస్త్రప్రయోగోపసంహారములు నాకుఁ దెలిసి
నవే యైనను నాయుత్సాహము పోయి క్రుద్ధుఁ డగు

రాముని( జూచినకొలఁది నేలొకో భీతి జనించుచు
న్నది. కావున, నే నిట నుండి వేగముగాఁ బోవుదును.
ఆహా! రావణుఁడు భయపడుట కిదియే మొదటిసారి.

(నిష్క్రమించును.)

విశ్వా:—(దూరముగాఁ బ్రవేశించి తనలో) ఆహా!

చ. పరబల మెంతయైన ననుఁ బాయదు సాహస మెన్నఁడున్ మహో
ద్ధురత గృహీతచాపుఁడయి దుష్ప్రసహాకృతి నొప్పుచున్న యీ
ఖరకరవంశమండనుని గాంచినయంతన చిత్తమందు నా
గురుతరభీతిచేత వడఁకెన్ బరమాద్భుతభంగిఁ జూడఁగన్.

గీ. అతివిఘాతుకములు పరిశ్శతము లగుచుఁ
గలవు వనముల మృగములు; కాని, యుంత
సింహ మొక్కటియే వనసీమ నెల్ల
గలఁచివైచును గాఁడె విక్రమము మెఱయ. ౨౮

ఆహా! తులితాఖిలదేవాసురబలుఁడు, అవిగణితనిఖిల భువనవిదారణక్షమ మహాశైలభిద్భిదురశక్తి మహాప్రభావుఁడు, విదితసర్వాస్త్రసంహారుఁడు, మహాద్రివలె నకంప్యశరీరుఁడు నగు రావణుఁడే కుపితుఁడగు రాముని జూచి భయకంపితుఁడై మృగేంద్రదర్శనమాత్రమున మృత్యుశంకఁ బాఱిపోవు లేడివలెఁ బాఱిపోయెను! ఈదురాత్ముఁడు రథ మెక్కి లంకాపురి కేఁగుచున్నాఁడు. నేను వీని ననుసరించెదను. లేనిచో సీత కెక్కడ యనిష్టము చేసిపోవునో. (నిష్క్రమించును)

రాము:—(కొంతసేపు ధ్యానించి బాణము విడువఁ జూచును.)

భర:—ఆర్యా! శాంతింపుము. ఈవృక్షములు దగ్ధ మగుటవలన

నిరపరాధము లగుపక్షిగణములు నిరావాసములై బాధ
పడఁగలవు.

చ. వలదు శరంబు నిట్లు విడువన్ గృపసేయుము పక్షు లెల్లఁ బి
ప్పలతరు వాశ్రయించి తమభార్యల బిడ్డలఁ గూడియుండెఁ జం
చలములు దుర్బలమ్ము లగుచక్కనిపక్షులమేను లేడ ను
జ్జ్వల మగునీశరం బశనిపాతసదృక్ష మదేడ? చూడఁగన్.

క. శరణాగతరక్షణ మరి
హరణం బపరాధిశిక్ష నాయుధములతో
నరపతు లొనరించెద రీ
శరమును నుపసంహరింపు చయ్యన నార్యా! ౨౯

రాము:—(లజ్జితునివలె) సరే. ఈవాయవ్యాస్త్రమున నామహా
శిలను దూరముగాఁ బాఱవేయించెదను.

(అస్త్రము విడుచును.)

లక్ష్మ:—ఇదియు వ్యర్థ మయ్యెను.

రాము:—ఈయస్త్రము సాపరాధము.

భర:—(ముందు చూచి) ఆర్యా!

క. అపరాధం బొనరించియు
నుపకారక మయ్యె నస్త్ర మొగి స్త్రీహననా
త్యపచారము నీయెడఁ దా
నుపకల్పింపకయె కాచె నోగుణమూర్తీ! 30

రాము:—(చూచి) ఔనౌను. వారు మన ప్రసాదచేటికలు.
ఓహో! మంథరకూడ.

[అంతఁ జేటికలు మంథర ప్రవేశింతురు.]

మంథ:—ఓసీ! ఒడలు మఱచి తిరుగుచున్నమీరు దాసికలే

యగుదురు. మీరు మీపనులు విడిచి యిట నాట
లాడుదు రేల? వచ్చినదారిని బొండు.

మధురిక:—మేము చేయవలసినపని యంతయుఁ జేసితిమి. మఱి
కొందఱు పరిచారిక లట నున్నారు. మేము విశ్రాంతి
తీసికొనుచున్నాము. మరల మాపని వచ్చినప్పుడు
పోయెదము.

మంథ:—మూర్ఖురాలా! ఎప్పు డేపని చేయవలసియుండునో నీ
కేమి తెలియును? రాణులసేవ యన్న మాట లను
కొంటిరా? పొండు.

చతురిక:—నీవును దాసివే. మేము మారాణులపను లెట్లు
చేయుదుమో కైకేయిపనులు నీవు నట్లు చేయుదువు.

మంథ:—కాదు. కాదు. కైకేయి నాపుత్త్రిక. సఖీసమాన. నే
నామెను సేవింపను. సాయమమాత్రము చేయుదును.
మీరు గర్భదాసు లిది యెఱుఁగరు.

చతు:—ఏమే! నీవు దాసివి కావా? దాసివలెనే మాటాడితివే?

మంథ:—(కోపముతో) ఓఁ? దాసివలెనే మాటాడితినా? నన్ను
మారాణి తల్లిగాఁ బరమదైవముగాఁ జూచును.

మధు:—దాస్యము చేయుచున్నను నీవు నీరాణికిఁ దల్లివైనవో
మేమును మారాణులకుఁ దల్లులమే.

మంథ:—నేను సంస్కృతము మాటాడుదును.

చతు:—నీవు సంస్కృతము మాటాడినను నీయవినయము,
ఆత్మస్తుతి, నీదాసీత్వమును జెప్పక చెప్పుచున్నవి.
గొప్పవా రెప్పుడును దమ్ముఁదాము పొగడుకొనరు.

మంథ:—మీ రిక్కడనుండి లేచి పొండు. మిమ్ము నాజ్ఞాపించు

చున్నాను.

అందఱు:—(నవ్వి) ఏమి! దాసికిఁ గూడ నాజ్ఞాపించు నధికారమే?

మంథ:—(తనలో) ఈగర్భదాసులు నన్నవమానించినారు. నాయవమానము కైకేయి యవమానమే. భరతుఁడు దగ్గఱలోనే యున్నాఁడు. రామానురక్తలగునీగర్భదాసికలు వాని కేమియప్రియము చేయుదురో? రహస్యముగా నుండి కనిపెట్టెదను. (ప్రకాశముగా) నేను వెళ్ళి మీయవినయము రాణులతోఁ జెప్పి యేమిచేయించెదనో చూడుఁడు. (నిష్క్రమించును)

చతు:—కురూపమునకుఁ దగినట్లు కుటిలభావము కలమంథర పోయినది. ఇట్టికురూపముతో నున్నను, ఈమె గర్వమునకు మితి లేదు. నిజముగా నందగత్తియే యైన నింకె ట్లుండునో? మధురికా! గౌరీమండపము నలంకరించుటకై పిప్పలపలాశపల్లవములఁ గోయుటకు మన మిచటికి వచ్చితిమి. రాజప్రాసాదము చాల దూరమున నున్నది. త్వరగాఁ గోసికొని పోవుదము రండు.

పుష్పలతిక:—(నేలకిఁ జూచి) ఈరావియాకు లన్నియుఁ జిల్లులు పడినవే! ఎందుచేతనో? (అంద ఱాశ్చర్యముతోఁ జూచెదరు)

చతు:—(భూమిపైఁ జూచి) ఇక్కడఁ జాలఁ గాలిగుర్తులు కలవు. గుఱ్ఱపుడెక్కలగుర్తులు రథచక్రములగుర్తులు కనఁబడుచున్నవి.

మధు:—రథములోఁ గుమారు లిటకు వచ్చి రనుకొందును.

చతు:—ఈగుర్తులే కాని రథము వచ్చివెళ్ళినజాడ లేదే!

మధు:—ఏదో భూతము వచ్చిన ట్లున్నది. భయ మగుచున్నది

పోదము. రండు. (నిష్క్రమింతురు)

భర:—భయపడి చేటికలు పరుగిడుచున్నారేలొకో? అక్కడ వారి కేదియో భయము కలిగియుండును.

శత్రు:—అక్కడే యాస్యనియస్త్రము మొక్కవోయినది.

రాము:—ఎవఁడో యట మఱుఁగుపడి మనల నెదిరించి యుండ వచ్చును. యోగప్రభావమువలన మాయాశక్తివలన నదృశ్యముగా నుండవచ్చునని వింటిని. యోగులు మనల నెదిరింపరు. కానిమ్ము. భావగామి యైన నాయస్త్ర మదృశ్యుల నైనఁ బ్రహరించును. దానితో నాయస్త్ర కౌశలమును బ్రదర్శించెదను. (బాణము సంధించును.)

[అంత దూరమున వసిష్ఠుఁడు ప్రవేశించును.]

భర:—(చూచి) అయ్యో! ప్రమాదము. భగవానులు, ఆర్య గురుపాదులే నీబాణమునకు లక్ష్యముగా వచ్చినారు. బాణ ముపసంహరింపుము.

రాము:—(బాణ ముపసంహరించి) ఏరీ గురువులు? యోగప్రభావ పిహితదేహులై నాచికీర్ష( జూచియుందురు. వీరివలననే నాయస్త్రము మొక్కవోయి యుండును. పూజార్హు లగువీరు నాబాణమునకు లక్ష్యమైరి. ఇట్లే తెలియమిచే దేవతలుకూడ పరిభవింపఁబడుచుందురు.

క. శిరముల నిప్పుడె సద్గురు
చరణంబుల నిలిపి పరమసంభావ్యముగా
శరణంచు క్షమాభిక్షము
త్వరగాఁ గోరుదము రండు ధన్యుల గురులన్. 30

అందఱు:—రండు. (వసిష్ఠునిపాదములపైఁ బడి)

క. మము మన్నింపుఁడు కడు దో
షమునకు గుఱియైతి మిట్లు సంయమినాథా! ౩౨
క్షమఁ దమ బాలకు లపరా
ధము నొనరించినను బ్రోవఁ దలఁపరె పితరుల్.

సీ. సుతులు శిష్యులు నపరాధశతము చేయ
గురులు క్షమియింత్రు వాత్సల్యపరవశు లయి
బాలురము మేము తెలియక పాలుపడిన
దోషమును విస్మరింపు సంతోష మొదవ. ౩౩

వసి:—ఇది యేమి? మీకు దోషము లేదు. నాకుఁ గోపము లేదు. దీర్ఘాయుష్మంతులారా! లెండు.

రాము:—మహాశిల నైనను బిండిపిండి చేయునది నాబాణము. మీరు మిక్కిలి వృద్ధులు. మహాత్మా! నాదోషము చెప్పలే కుంటిని. క్షమింపుఁడు.

వసి:—వెఱ్ఱివాఁడా! నీ వెంతశస్త్రాస్త్రజ్ఞుఁడ వైనను నింకను బాలుఁడవే.

గీ. ఏశరీరమ్మునందు మున్ గౌశికాస్త్ర
వితతి నిర్వీర్యమై కడు వితథ మయ్యె
నట్టి దేహమ్మునందు నీయస్త్ర మెట్లు
వికృతిఁ గల్గించు నోబాలవీర! నేఁడు. ౩౪

మఱియు;

మ. కవచం బౌచు శమంబె బ్రాహ్మణవరుల్ గాపాడుఁ జక్రాశని
ప్రవిఘాతంబులబారినుండి భయ మావంతైన లే దందుచే
భవదీయాస్త్రమున న్దలంప యమసంపన్నంబు లౌ యోగిపుం
గవదేహమ్ములనస్త్రశస్త్రములు తాఁకం జాలవొక్కింతయున్.

నన్ను లక్ష్యించి విడిచినబాణములు ప్రతీపగాములై యాధనుర్ధరునే బాధించును. ఐనను, నీవు నే నచ్చట నున్న ట్లెఱుఁగక ప్రయోగించితివి కాన, నీయస్త్రములు నిన్ను బాధింప లేదు.

రాము:—(నమస్కరించి)

క. గురుదేవులు భగవానులు
వరమంత్రద్రష్ట లైనబ్రహ్మర్షులు స
త్కరుణ మముఁ బ్రోచుచుండఁగ
నిరతము, మా కేల కష్టనిచయము కలుగున్ ?

భర:—భగవానులు మా కేమంగళ మొసఁగఁగోరి యిటు లను గ్రహించి విచ్చేసిరో కదా !

వసి:—నేనును వనసంచారకుతూహలమున నిటకు వచ్చి యీ ప్రాంతమున నొకకమండలు వుండుట చూచి యటఁ గూర్చుంటిని. పిదప నది విశ్వామిత్రుని దని తెలిసి కొంటిని.

రాము:—ఏమి ? విశ్వామిత్రులుకూడ నట నున్నారా ?

వసి:—ఆయన రావణునితో వెళ్లి యుండెను. మహారాజు నేదో యడుగఁ గోరి ఱేపు వచ్చెద నని చెప్పెను.

రాము:—ఐనచో, ఱేపు విశ్వామిత్రులను జూచి ధన్యుల మయ్యెదము. కాని, యామహర్షి యింతవఱకు వచ్చి మమ్ము దీవనలతో నేల యభినందింప లేదో ? రావణుఁ డేల వచ్చెనో ? ఆతఁడు మహాబలుఁ డనియు సురాసుర జేత యనియు వర్చస్వి యనియు సర్వవిద్యాపారదృశ్వుఁ డనియు వింటిమి కాని, కేవల మధర్మపోషకుఁడఁట.

వసి:—రావణుఁడు వత్సలగు మీకు ననిష్టము చేయుటకే వచ్చినాఁడు. ఆతనిరథముతో నాతఁడు తిరస్కరణీవిద్యవలన నిగూఢముగా నుండెను. విశ్వామిత్రుఁడు కూడ మీ ప్రభావము విని చూడవచ్చెను. ఆతఁడును రావణు నుదంత మెఱుంగకుండుటకు యోగప్రభావముచే నిగూఢుండయియే వచ్చెను.

రాము:—తరువాతఁ దరువాత ?

వసి:—రావణుఁడు మిమ్ముఁ జూచి వచ్చినదారినే వెడలిపోయెను. ఆపాపి దారిలో నేమైనఁ బాపకృత్య మొనరించునేమో యని తపోవనాంతముదాఁక విశ్వామిత్రుఁడాతని ననుసరించెను. ఈసంగతి మీకుఁ జెప్పుటకే నేనిటు వచ్చుచుంటిని.

రాము:—ఐన, విశ్వామిత్రులను మేము సేవ చూచెద మన్నమాట.

వసి:—ఆ. నేను మీకుఁ జెప్పినట్లు వినయనియమములతో నాతని మనస్సున కెక్కునట్లు పాదస్పర్శపురస్సరముగా నమస్కరింపుఁడు.

రాము:—ఆయన క్షత్త్రియుఁ డని వింటిమి ?

వసి:—ఐన నేమి ?

రాము:—బ్రాహ్మణచరణములనువలె క్షత్త్రియచరణములను మాశిరములకుఁ దగులనిత్తుమా ?

వసి:—ఆతఁడు మిక్కిలి తపశ్శాలి.

రాము:—తపమే బ్రాహ్మణత్వ హేతువా ?

గీ. తపము శ్రుతమును కులము నీత్రయముఁ గూడి
యున్నను బ్రాహ్మణకారక మందు రట్టి
త్రయము నెన్నఁడు కమరు నాతండె ధరను
బ్రాహ్మణోత్తముఁడై విశ్వవంద్యుఁ డగును. ౩౭

వసి:—ఆమాట సామాన్యతపోవిషయమున. మహాతపఃఫల మలోకసామాన్యము.

రాము:—ఎట్లు?

వసి:—ఈతపఃప్రభావమువలన విశ్వామిత్రుఁడే కాఁడు. ఆతని తండ్రితాతలు కూడ ఋషిత్వము బ్రహ్మత్వము నందిరి.

భర:—ఆతఁడు బ్రాహ్మణుఁడో యబ్రాహ్మణుఁడో మన కేల? గురువులయాదేశమే మనకు శిరోధార్యము. మనము క్షత్త్రియులము. వయసుచే విద్యచేఁ దపముచే నాతఁడు మనకుఁ బూజార్హుఁడు. దీని కాలోచన మేల?

రాము:—ఔనుకాని కర్తవ్యమును గూర్చి గురువుల నడిగి తెలిసికొనుట మంచిది.

వసి:—నేను జెప్పినమాట మఱవకుఁడు.

అందఱు:—గురువుల యాజ్ఞ నిర్వర్తింతుము.

(అందఱు నిష్క్రమింతురు)

మంథర:—(ప్రవేశించి) కపటపండితుఁ డగువసిష్ఠునిసంగతి కంటివి. వింటివి. ఆతఁ డెప్పుడును రామునితోడనే మాటాడును గాని భరతుని లక్ష్యపెట్టఁడు. దాసీపుత్త్రు లగుపౌరజను లందఱు రామానురక్తులే. రాముఁడు చిక్కఁడను వచ్చి నట్లు చెప్పుచున్నారు. వానిపనులు చాల ననార్య్య జాతివఁట. ఆతఁ డప్రతిరథుఁడఁట. నృపులఁ బరా

రాముని కే రాజ్య మీయఁ దలఁచుటయు వింటిని. రావణుఁడు రామవిరోధియై యతనిఁ జంపివేయుచో నిఁక భరతుఁడే నిష్కంటకముగా రాజ్య మేలఁగలఁడు. ఆహా ! నాభర్తృదారిక యగు కైకేయికిసైతము రాముఁడన్న నే యిష్టము. భరతునికి రాజ్యము రానిచో నా పేరు మంథర కాదు. అనార్యులు, అసురులు, పిశాచములు వీరిని రామునికి మహారాజునకు శత్రువులుగాఁ జేసి నేను భరతునే మహారాజును జేయుదును. వృద్ధ వసిష్ఠుఁడు కాని కపటసుమంత్రుఁడు కాని యేమి చేయఁగలరో చూచెదను. అమ్మో ! సుమంత్రుఁడు వచ్చుచున్నాఁడు. (నిష్క్రమించును.)

సుమం:—(ప్రవేశించి) ఇపుడు విశ్వామిత్రమహర్షి వచ్చెను. మరల వచ్చునఁట. రావణుఁడు వచ్చి పోయినాఁడు. తన యాతిథ్యమును గైకొనకయే యేల రావణుఁడు వెడలి పోయెనో యని మహారాజు ఖేదపడుచున్నాఁడు. రావణుఁడు క్షత్రియవైరి యైనను, ఆతిథ్యమున కర్హుఁడు.

మ. తరుమూలంబున వాఁడిగోడ్డలిని జేతంబూని ఖండింపఁగా
దారకొన్నట్టివిరోధి కాతరువె సంతోషంబుతో నీడ ని
చ్చి రుచి న్మించెడుపండ్లొసంగి మఱియు న్జల్వారు పుష్పంబుల
స్గరుణామేయత నిచ్చు నీవిధములౌఁ గా దే ధరణ్యమాన్యతల్.

(తెరలో)

గీ. ఇపుడు రావణుఁ డీచటికి నేఁగుదెంచె
నన్న సంగతి విని విస్మయమ్ము తోడ,

రాత్రి పురరక్షణమ్మును శ్రద్ధమీఱఁ
జేయుఁ డని రక్షకులను శాసించె నృపుఁడు. ౭౯

సుమం:—(విని)సరే. నేను రక్షకుల కిది తెలుప నేఁగెదను.

(నిష్క్రమించును.)

[గంధర్వులు ప్రవేశింతురు]

గంధ:—ఓ ధనాధిప దేవాధిపులారా!

మ. తతశస్త్రాస్త్రవిదుండు నిష్ఠురతపోధన్యప్రభావాతిశం
పిత దేవేంద్రుఁడు కౌశికర్షి కృప జేపే రాముఁ గొంచపోవు ను
ద్ధతశాపమ్ముననో శరమ్మునను దైత్యస్వామి నీతండె సం
హృతి నొందించును మీకు భీతి యికనేలా! రామరక్షావిధిన్.

క. రాముఁడె బలుఁ డగువీరుఁడు
రాముఁడె సర్వాస్త్రశస్త్రరాజితహస్తుం
డా మహనీయుఁడె చంపును
దా ముదమున రావణాదిదనుజుల నెల్లన్. ౮౧

(నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము

---

## ప్రవేశిక i

[ప్రవేశము నలుగురువైతాళికులు ప్రాసాదముపై]

మొదటివాఁడు:—ఓరీ! భషకా! కటుకంఠా! నే నీగీతము చాలసారులు విన్నాను. నీవు నాగీతము విను. నీగీతము భజ్యమానశుష్కవేణుశబ్దము రా.

రెండవవాఁడు:—ఓరీ! మాళవకా! విను. నీస్వరము గార్దభస్వరము రా.

మూఁడవవాఁడు:—మీ యిరువురకు గీత మన్న నేమియో తెలియనే తెలియదు. వాద్యములతోఁ గూడిన నా గీతము వినిన మీరు చావవలసినదే.

నాలవవాఁడు:—నేను సంస్కృతగీతము పాడుదును. మీకు సంస్కృతము రాదు. అందుచే నాగీతము మీకు రుచింపదు. ఒక్కసారి నాగీతము విన్న రాజు మరల వినఁడు. అదే నాగీతజ్ఞత.

మాళవకుఁడు:—భావ! గోపిలుఁడు సంస్కృతమునఁ జదువును. అందుచే మహారాజతనిగీతమును వినును. మహారాజు నాగీతము వినెనా యింక మీగీతము వినఁడు.

భవకుఁడు:—నే నిపుడు ప్రత్యూషకాల మగుటచే మహారాజును లేపుట కేఁగుదును. గోపిలుఁడు పాడుట కనుమతి లేదు.

మాళ:—ఓరీ! నీగీతమువిన్న మహారాజునకు నిద్రపాటిపోవునురా! అంతే కాదు. సర్వభూతములును భయపడి పరుగెత్తును.

దంతిలుఁడు:—భావ! గోపిలా! వాద్యములేని నీగీతమును మహారాజెట్లు వినును? నన్నుఁగూడఁ గొనిపొమ్ము. నా వాద్యము వాయించెదను.

గోపి:—సమయము వచ్చినపుడు చెప్పెదను లే.

విదూ:—(ప్రవేశించి) మీ రిక్కడేమి చేయుచున్నారు?

గోపి:—సుందరకా! నీకు స్వాగతము.

విదూ:—ఇపుడు విశ్వామిత్రమహర్షి వచ్చినాఁడు. మన మాతనిఁ జూడవలయును.

గోపి:—ప్రతిదినము మహారాజప్రాసాదమునకు ఋషులు వచ్చుచునే యుండుట మనము చూచితిమి. విశ్వామిత్రునిపై

నీ కెంతపక్షపాత మేల ?

విదూ.—ఆయనకు రెండుముఖములు నాలుగుచేతులు నున్నవి. వీపు లేదు. రెండుప్రక్కల ముఖమే కనఁబడును.

గోపి:—రెండుప్రక్కల ముఖమా ? ఇది యె ట్లుండును ?

విదూ:—ఓరీ ! ఆయన బ్రాహ్మణుఁడు. క్షత్రియుఁడు. రాజ ఋషి. అక్షమాలాధారి. ధనుర్ధరుఁడు. ముందు వెను కలు చూడఁగలఁడు. ఉభయతో ముఖుండు కానిచో నెట్లు చూడఁగలఁడు ?

గోపి:—రెండుముఖములతో నాయన యేమి చేయును ?

విదూ:—ఒకదానితో వేదము చదువును. రెండవదానితో శాపము లిచ్చును.

గోపి:—నాలుగుచేతులతో నేమి చేయును ?

విదూ:—రెండింటితో బ్రహ్మకర్మ. రెండింటితో యుద్ధకర్మ.

గోపి:—కేవలనారాయణునికే నాలుగుచేతు లుండు నని చెప్పుదురు.

విదూ:—భగవంతుఁ డగునారాయణునకు నాలుగుచేతులునొక్క ప్రక్కనే యుండును. ఒక్కముఖము మాత్రమే యుం డును. ఈయనకు రెండుముఖములు. రెండుప్రక్కల రెండురెండు చేతులు.

గోపి:—ఆయనను నీవు చూచినావా ?

విదూ:—ఓరీమూర్ఖా ! వేఱే చూడవలెనఁటరా. విన్నాను. ఎప్పుడుచూచినదానికన్న విన్న దే యెక్కువప్రమాణము.

గోపి:—ప్రత్యక్షముగాఁ గనఁబడుదానివిషయము నదృష్టప్రమా ణమే మిన్న.

విదూ:—ఓరీమూర్ఖా! ఒకప్పుడు కన్నులకుఁ బొగరోగము, ఎండ దెబ్బ, మున్నగువానిచే వైకల్యము రావచ్చును. చెవులకు వైకల్య మెప్పుడును రాదు.

గోపి:—సరే. నీవు విశ్వామిత్రునిఁగూర్చి విన్నావు. నే నిపుడే చూచెదను.

విదూ:—నీవు జాగ్రత్తగాఁ జూచి చూచినది చూచినట్లు నాతోఁ జెప్పు.

గోపి:—నీవుకూడ నచటికి నచ్చెదవు గాదా? స్వయముగా నాయనను దర్శింపుము.

విదూ:—అబ్బో! నే నాయనను జూడలేను. ఆయనకుఁ గోప మెక్కువఁట. ఆయన దండకాష్ఠముతో నాబుఱ్ఱ పగులఁ గొట్టునేమో. దూరమునుండియే చూచెదను.

(తెరలో)

మ. మును శస్త్రంబుల నెవ్వఁ డుద్ధతుల నిర్మూలించె; నెవ్వండు శక్రుని భీతిల్లఁగఁ జేసె నిష్ఠురతపోగూఢిన్ మహర్షీంద్రుఁ డా యనద్యుం డగుకౌశికప్రభువు బ్రహ్మక్షత్రతేజోమయుం డనలాగారమునన్ వసించె నృపవీక్షాతిత్వరన్ జూపుచున్.

అందఱు:—విశ్వామిత్రులు వచ్చినారు. రండు. పోవుదము.

(నిష్క్రమింతురు)

ఇది ప్రవేశిక.



# యజ్ఞఫలము

## చతుర్థాంకము

[ఆసనస్థుఁడై విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

విశ్వా:—క. క్రతురక్షణ మనియెడునొక
కృతకపుహేతువున రాము నిమ్మని రాజున్
బతిమాలెద నాయస్త్రము
లతిపాత్రున కతని కిచ్చి యానందింతున్. ౧

సుమంత్రుఁడు:—(ప్రవేశించి) భగవానులకు నమస్కారములు.

విశ్వా:—యశోవంతుఁడ వౌదువుగాక !

సుమం:—భగవానుఁడా ! నీయాశీర్వచనమునఁ గృతకృత్యుఁడగుటకు మహారాజిదే యిటకు విచ్చేయుచున్నాఁడు.

విశ్వా:—నేను రాజురాకకే యెదురుచూచుచుంటిని.

[మహారాజు, వసిష్ఠుఁడు, కుమారులు, విదూషకుఁడు, ఇతరులు ప్రవేశింతురు.]

రాజు:—తపోధనులు, మహామహులు నగువిశ్వామిత్రులకు సూర్యవంశజుఁ డగుదశరథుఁ డిదే నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును)

విశ్వా:—(లేచి)అనామయము, యశస్సు నీకు లభించుఁగాక !

రాజు:—భగవానుఁడా ! కూర్చుండి యే ఆశీర్వర్షము కురిపింతురుగాక !

విశ్వా:— గీ. ప్రథితదైతత్వపాలకత్వములు నీకు
వఱలు నిత్యము రాజత్వవర్తనమున;
ఏల నిలుచుండరాదు నీపాల నేను ?
ప్రియవయస్యుని నిను గౌరవింప వలదె ? ౨

రాజు:— దేవా !

గీ. నాగుణమ్ములకును గారణంబు మీరు
క్షుద్రుఁడను నేను విశ్వసంస్తుతులు మీరు
ఇట్టిమిమ్ముఁ గొల్వ నింద్రుని కేని తగును
వసుధ నే నెంత నా వైభవమ్ము నెంత ? 3

మఱియు,

గీ. అధిక మైనతపోవృత్తి యందు మెలఁగు
మమ్ము మన్నింపఁ గలమహానిమండను లయి
నిలిచియుండిన నింకఁ బై నిలిచిపోవె
అవని మామకసర్వకార్యములు దేవ ! ౪

భగవానుఁడా ! కూర్చుండుఁడు.

విశ్వా:—(వసిష్ఠులతో) మహర్షీ ! నమస్తే !

వసి:— క. తపమున బ్రహ్మత్వముగా
న్న పరమఋషివి లభించె ననంతమహత్త్వం
బప్డే నీ కిదె చేయుదుఁ
గృపఁ గొను ప్రతివందనంబుఁ గృతకృత్యుఁడవై. ౫

కూర్చుండుము. (కూర్చుందురు)

కుమా:—సావిత్రులమగు మేము భగవానులకు నమస్కరించుచున్నాము. (పాదములుముట్టి విశ్వామిత్రులకు నమస్కరింతురు.)

విశ్వా:—అప్రతిరథులు, దీర్ఘాయుష్కులు, లోకప్రణయభాజులు

నొందుదురుగాక! అందఱకు భద్ర మగుఁగాక! కూర్చుం
డుఁడు. (అందఱు కూర్చుందురు)

రాజు:-తమతపఃక్రియ లేయాతంకములు లేక జరుగుచున్నవి
కదా!

విశ్వా:- గీ. నీవు రాజయి యుండ నిర్నిద్రధర్మ
యుక్తిఁ బ్రజ లెల్ల సుఖయించు చున్నయట్లు
అంతరాయము లేక మాయాశ్రమమున
సాగుచున్నది తాపసాచార మధిప! ౬

వసి:-ఇది సహజమే కదా!

గీ. పరమనృపులు స్వధర్మంబుఁ బాటిసేయ
సౌఖ్య మబ్బుట ఋషుల కాశ్చర్య మగునె?
చమురు చాలినయంతగా నమరెనేని
దీప మారునె నిర్వాతదేశమందు? ౭

విశ్వా:-(సగర్వముగా)

గీ. రాజ్యమును నిర్వహింపఁ బురందరాదు
లైన రాజులసాహాయ్య మభిలషింతు
రేసహాయుఁడు లేక మునీంద్రు లాత్మ
మహిమచే నిర్వహింత్రు కర్మమ్ము లెల్ల. ౮

(ఆలోచించి లోపల) ఇది నాకోరికకు విరుద్ధ మగుమాట
కదా! ఇట్లందును. (ప్రకాశముగా) ఐనను.

గీ. అఖిల మగుతపోవిఘ్నమ్ము లవలఁద్రోలు
నిన్ను నొక్కటి యాచింతు నేను నృప.

రాజు:- ఆజ్ఞసేయుఁడు మీయాజ్ఞ లవధరింతుఁ
బరమహానులపాదసేవకుఁడ నేను. ౯

విశ్వా:—(వసిష్ఠునితో) భగవానుఁడా! అనంతరబ్రహ్మకులా! ఈదాశరథులు నలువురు యథావిధి నీచే నుపవీతు లైరా యని యడుగ నక్కఱ లే దనుకొందును.

వసి:—ఔను.

విశ్వా:—వీ రెవరికడ శాస్త్రములు శస్త్రములు నభ్యసించిరి?

వసి:—శాస్త్రము లన్నియు నాకడ.

విశ్వా:—ఏయేశాస్త్రములు?

వసి:—మంత్రద్రష్టృత్వమునందక్క నన్నివిద్యలలో వీరు నిష్ణాతులు.

విశ్వా:—ఈవయసు వచ్చుసరికే వీ రిన్నివిద్యలు నేర్చుట యలోకసామాన్యవిషయము. ఇది నీమహిమయే కాని వేఱు కాదు.

వసి:—ఇంతకు,

గీ. స్నిగ్ధ మగువర్తి దీపంపుశిఖ గ్రహింప
నర్హ మౌఁగాని మృత్పిండ మర్హ మగునె?
ధీగుణమ్ముల స్నేహసందీప్తవృత్తిఁ
గొనును విద్యల శిష్యుఁడు గురునివలన. ౧౦

విశ్వా:—హాయిగా మేడలో నుండి యనుభవజ్ఞానము లేక వీ రేక్రమమున నిన్నివిద్యలు నేర్వఁగలిగిరి?

వసి:— గీ. విమలమతితోడ గురుబోధనముల వినుచు
శ్రద్ధతో మననంబును జలిపి యెఱుఁగ
వలయు నియ్యది శాస్త్రసంకలనమునకు
సమ్మతం బైనప్రాక్తనాచారసరణి. ౧౧

విశ్వా:—ఎప్పుడైన నెవరైన వీరిని బరీక్షించిరా? ఏలన,

గీ. ఎన్నఁడు గురుండు సుస్నిగ్ధహృదయుఁ డగుట
శిష్యుఁ దలపోయు జ్ఞానవిశిష్టునిగను
సర్వమున సంతతంబు నిసర్గమైన
ప్రణయ మరయు గుణాధికత్వమ్ము నిజము. ౧౨.

వసి:—వీరిని బరీక్షింప నీకంటె సమర్థు లెవరు? (కుమారులతో)
దీర్ఘాయుష్మంతులారా! విశ్వామిత్రభగవానులు మిమ్ముఁ
బ్రశ్నింతురు. మీరు మీచదివినట్లుగా సమాధాన
మిండు.

కుమా:—చిత్తము.

విశ్వా:—కుమారులారా! అప్రతిమానశాస్త్రవిదులు గురువులు,
భగవంతులు నగు వసిష్ఠులవారు మీ కేమి నేర్పిరి?

రాము:—(లేచి నమస్కరించి) అన్నిటికంటె ముందు గురువుల
యెడ వినయము, స్నేహితులయెడఁ బ్రణయము, దీనుల
యెడ దయ, శత్రువులయెడ నిర్భయత్వము, మాకు
గురువులు నేర్పిరి. పిదప, భగవానులు నాలుగు వేద
ములు, ససూత్రార్థసంగ్రహముగా వ్యాకరణము, అర్థ
పదనిర్వచనము, గ్రహచారము, పతంజలియోగ శాస్త్ర
ము, మానవాచారశాస్త్రము, చతుర్వింశతి వ్యవహార
నిర్ణయము, వాసిష్ఠరాజశాస్త్రము, మేధాతిథిన్యాయ
శాస్త్రము, కాసకృత్స్న మగుమీమాంసాశాస్త్రము
నిట్లే యితరము లగునుపయోగిశాస్త్రములు, గజాశ్వ
రత్నపరీక్ష, శకునజ్ఞానము, కావ్యకళ మున్నగునవి
నేర్పిరి. నాతమ్ములు వానినెల్ల బాగుగా గ్రహించిరి.
నేనును జదివితిని. జ్ఞాపక మున్నవి.

భరతలక్ష్మణశత్రుఘ్నులు:—ఆహా! ఆర్యునిమహానుభావత్వము !

గీ. సజ్జనుం డన్యగుణము లేశంబు నైనఁ
గాంచు నుత్కర్షభరితంబు గాఁగ నటులె
స్వీయగుణము లత్యుత్తమశ్రేణి వయ్యు
స్వల్పములు గాఁగ నెపుడు చెప్పం గడంగు. ౧౩

విశ్వా:-సంతుష్టుఁడ నైతిని. ఇఁక, శాస్త్రాగమము మెవ్వరివలన నేర్చితిరి ?

లక్ష్మ:—(రామునితో) ఆర్యా ! నా బాలచాపలము క్షమింపుఁడు. దీనికి సమాధానము నేను జెప్పెదను.

రాము:—సరే.

లక్ష్మ:—(విశ్వామిత్రునితో) భగవానుఁడా !

గీ. ఆర్యుఁ డీతఁడు సర్వశస్త్రాస్త్రవిదుఁడు
జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడును మాకు నితఁడె గురుఁడు
అస్త్రముల శాస్త్రముల నన్ని యరయనట్టి
ఘనరహస్యంబు లీతఁ డొక్కండె యెఱుఁగు. ౧౪

మఱియు,

గీ. జనకపాదారవిందప్రసాదమునను
అస్త్రశస్త్రాదివిద్యల నారితేఱి
సార మయ్యవి విజయసేనాపతికడ
నిత్యమును సాధనము చేసి నెగడినాము. ౧౫

విశ్వా:—గీ. శాస్త్రశస్త్రంబు లెఱుఁగువిజ్ఞాని కెన్న
సర్వమును వశ్య మన్న నాశ్చర్య మన్నె ?
కుంభజుఁడు వార్థిజలములఁ గ్రోలె నన్న
వాక్యమే నిర్ణయించు నవ్వాని శక్తి. ౧౬

లక్ష్మణా! నీకుఁ గలరామభక్తికి ని న్నెంతయు నభినందింతును. ఎచ్చట స్నేహము, భక్తి ప్రకాశించునో యచ్చటనే గుణము నుండును. మీశస్త్రాస్త్రాను భవము నె ట్లెచ్చటఁ బ్రదర్శించితిరి? ఏలన,

గీ. అనుభవము లేనిశ్రుతము కాసంత యైన
నరుల కుపకారకము కాదు తఱచి చూడ
దధిని వర్తిలి యుండి మథనముఁ గనక
శ్రేష్ఠనవనీతసంసిద్ధి చేకుఱు నెటు? ౧౭

విదూ:—పెరుగు నాకు మిక్కిలి యిష్టము. దధి తిన్న నెయ్యి తిన్న ట్లేకదా?

రాము:—ఆర్యా!

గీ. ఆకృతియొ ద్రవ్యమో వస్తు వనఁగ? మఱియు
పదమొ వాక్యమొ శక్తిసంపదకు నెలవు?
గురులతో నింత వాదింపఁ గోరుచుంటి
శాస్త్రవిజ్ఞానదృఢత లక్ష్యంబు గాఁగ. ౧౮

మఱియు,

గీ. చలితవృక్షచ్ఛదము లేక శరముచేత
గ్రుచ్చి పెనుఱాలఁ జూర్ణించి, క్షోణిజముల
నిలువున దహించి యస్త్రముల్ నేర్చినట్లు
భక్తిఁ జూపింతు మీపురీప్రాంతమందు. ౧౯

విశ్వా:—కుమారులారా!

గీ. వినయవిస్పష్టతాధికవిలసితములు
మీరు పలికినపలుకులు మిమ్ముఁ జూడఁ

దెలియు మీశాస్త్రపాండితీదివ్యశక్తి
సంశయము లేదు నా కయ్యె సంతసంబు. ౨౦

కాని, శస్త్రవిద్యాభ్యాసపద్ధతిమాత్ర మిట్లు కాదు. ఏమి చేసినను నెదురొ్కనని చెట్లను, ఆకులను గొట్టుట వలన మీధనుర్ధరత్వ మెట్లు ప్రకటిత మగును ?

విదూ:—నిజము. నిజము. పచ్చనిచెట్లను, ఆకులను గొట్టిన నే మగును ? ఎండిపోయినచెట్టుకొమ్మలు విఱుగఁ గొట్టినఁ బొయ్యిలోనికైన వచ్చును.

రాజు:—విశ్వామిత్రభగవానులు నిజము పల్కినారు. కనుకనే నేను వీరి నపుడపుడు వేటకుఁ గొనిపోవుచుందును.

విశ్వా:—వనములందలి కేసరిగజమహిషాదు లగుమృగములు రాజుల కేమి యపకారము చేయును ?

రాజు:—అవి యావులను సస్యములను హింసించును.

విశ్వా:—అవి బలిష్ఠములై ప్రజాపీడ కల్గించిన దండింపఁదగినవే కాని, ప్రకృతిజనులను బీడించుచు ధర్మలోపమును గలిగించుచు, మహాబలవంతులై వివిధాస్త్రకుశలురై యున్న దుర్మార్గుల నెవ్వరు చంపుదురు? మహారాజా! రాక్షసు లనేకులు బలవంతులై ధర్మప్రజాపీడ గలిగించుచున్నారు. నీ వెఱుఁగవా ? కుమారులను నీతో నడవికిఁ దీసికొని పోయినంతమాత్రమున వీరికి రాక్షసులతో యుద్ధము చేయు ననుభవ మెట్లు కలుగును ?

రాజు:—(ఆశ్చర్యముతో) మునీంద్రా ! ఎవ్వ రాదుర్మార్గులు ? నారాజ్యమునఁ గూడ ధర్మప్రజాపీడయా ? ఆబలవంతు లెవ్వరో నాయెదుటఁ బ్రజాపీడ యొనరించిన క్షణ

ములో వారిని సంహరించి యుందును.

విశ్వా:—రాజా! నీవు కన్నులు మూసికొని కూరుచుండిన నీకు దుర్మార్గులు కనిపింతురా? వారిని గనిపెట్టి చంప వలయునే కాని వారు నీతో యుద్ధము చేయ నీయింటి కరుదెంతురా?

రాజు:—గ్రామవాసులు, కృషీవలులు, గోపాలురు, వణిజులు, సార్థవాహులు నెవ్వరును రాక్షసపీడనుండి కాపాడ నన్నుఁ గోర లేదే!

విశ్వా:—అసుర లన్న ధనలుబ్ధులు కారు. అందుచే వారు కృషీవలులజోలికి వణిజులజోలికి రారు. తపోవనములందు యజ్ఞములు చేయుతాపసులకు విఘ్నములు కలిగింతురు.

రాజు:—ఋషులు కాని తపస్వులు కాని న న్నిసాయము చేయుమని కోరనే లేదు.

విశ్వా:—ఋషులు, తపస్వులు, స్వతపోరక్షణకై క్షత్రియ సాహాయ్యమును యాచింపరు.

రాజు:—న న్నెవరును గోరకుండఁగనే నాకుఁ దెలియనిశత్రువుల నెట్లు రూపుమాపుదును?

విశ్వా:—

ఉ. ఎవ్వరుకోరఁగాఁదమము నెప్పుడుఁబాఱఁగఁద్రోలుసూర్యుఁడ
డెవ్వరు కోర వాయు వది యెల్లెడ వీచు జగంబులోనఁ ద
న్నెవ్వరు కోర శేషుఁడు మహీ దలపై నిలుపుఁ దలంపఁగా
నవ్విధి రాజు పాపుల నయాచితభంగి నణంపఁగాఁ దగున్.

ఇంతకును నేను క్షత్రియుఁడనై యున్నప్పుడు భగవానుఁ డగువసిష్ఠుని శస్త్రాస్త్రములతో హింసింపఁ బూనుట

మీా కందఱకును దెలిసినదేకదా! నాఁడు వసిష్ఠుఁడు తనశిష్యులు, అప్రతిరథవీరులు, నగుమిమ్ము సాయపడఁ గోరియుండెనా ?

రాజు:—పాపులను శాపముచే ఋషులేల నివారింపరాదు ?

విశ్వా:—శపించుటవలనఁ బుణ్యము క్షీణించును. అందుచేఁ దాపసులు తఱచు శపింపరు.

గీ. తాపసజనంబు కర్మకలాప మెల్ల
ఘోరశాపంబులనె తీర్పఁగొనెనేని
నున్నతం బగునీకీర్తి కుగ్రశౌర్య
మునకు ఫలమేమి చెప్పుమో భూతలేంద్ర! ౨౨

రాజు:—ధన్యుఁడను. మహాత్మా! మీాచే సూచింపఁబడితిని. నేఁడు నాకర్తవ్యమేమో సెలవిప్పింపుఁడు.

విశ్వా:—ఒకేక్రియ కలిగిన కార్యద్వయమును జెప్పుచున్నాను.

రాజు:—ఆద్వయ మేమి ? శీఘ్రముగా నాజ్ఞాపింతురుగాక !

విశ్వా:—గుణవయోజ్యేష్ఠుఁ డగునీకుమారునకు దివ్యాస్త్ర జ్ఞాపన మొకటి.

రాజు:—నానేర్చినదివ్యాస్త్రము లన్నియుఁ గుమారుల కొసంగితిని. రాముఁ డవి యన్నియుఁ జక్కఁగాఁ బ్రయోగింపఁ గలఁడు. నాకు రెండస్త్రములే తెలియనివి.

విశ్వా:—ఏ వవి ?

రాజు:—జృంభకాస్త్రము, బ్రహ్మాస్త్రము.

విశ్వా:—బ్రహ్మాస్త్రవిదు లగువసిష్ఠులవా రిచటనే యుండిరి గదా ?

వసి:—నేను బ్రహ్మాస్త్రముతో సర్వాస్త్రసంహారము చేయఁ

గలను. కాని, ప్రయోగింప లేను.

విశ్వా:—బ్రహ్మాస్త్ర మందినపిదప నే నాఱెండిటి నెఱింగితిని.

రాజు:—జృంభకాస్త్రముకూడఁ దమకుఁ దెలియునా?

విశ్వా:—చక్కఁగా.

రాజు:—అగుచోఁ గొంతకాలము తా మిట నుండి కుమారుల కాయస్త్రము లుపదేశింప నర్థించుచున్నాను.

విశ్వా:—నీమాట క్రమవిరుద్ధము.

రాజు:—ఎట్లు?

విశ్వా:—గీ. అర్థి యరుదెంచు దాతృగృహంబునకును
అరుగఁ డెన్నఁడు నర్థిగృహమ్ము దాత.
దప్పి చెందినవాఁడె పోవును సరసి
సరసి వెదకదు తృషితుఁ డౌనయునికొఱకు. — 93

రాజు:—నాగృహ మంతయుఁ దమదే. మేము నమస్కారములతో నిర్బంధించి మి మ్మిక్కడ నాఁపినైతుము.

విశ్వా:—రాజగృహము నానావ్యవహారాకులము. సాధసౌఖ్యములను విడిచి వన్యఫలాశినులము, వ్రతపరంపరాసితులము, బ్రహ్మవిచారనిషితమనస్కులము నగుమావంటి వారికి రెంటుమూఁడుదినములకన్న నిట నుండఁ దగదు. గృహస్థుల యావాసములు వివిధవ్యాపారనిలయము లై బ్రహ్మపరుల కేకాంతసుఖము కలిగింపఁజాలవు. నిర్జనములగు పర్ణశాలలయందే నివసించు తాపసులను గృహస్థు లెంత యైశ్వర్యముతో నైనను బరిచరింపఁజాలరు. రాజసంపదలు విరాగు లగు తాపసులను బంధింపఁ జాలవు.

రాజు:-మహాత్మా! క్షమింపుఁడు. తమయిష్టము నిట నెవ్వ రును గాదనువారు లేరు. భగవానుఁడా! పుత్త్రులు, భృత్యులు, సచివులు, సైన్యములు, నాసర్వప్రాసాద ములు, ప్రియమగునుపవనములు, వాహనములు, ధన ము, కోశము, సర్వియు మీవే. వేయేల, నాకిరీటము వలన లభించిన సమస్తము మీదయావిశేషమునకే యెదురుచూచును గాని యేసమయమున నడ్డు రాదు.

విశ్వా:-రాజా! రుద్రస్వేదము, మునిమనము, వీరపాణి, రామారుచి వీనిని బలవిత్తాదిసంపదలు బంధింపఁజాలవు.

వసి:-యుక్తిచే వీనిని బంధింపవచ్చును. ఎట్లన, గంధాశ్మ ముచే రుద్రస్వేదమును, భక్తిచే మునిమనస్సును, నమ స్కారముచే వీరపాణియును, దాక్షిణ్యముచే రమణీ సౌందర్యమును బద్ధము లగును.

విశ్వా:-కావచ్చును. కాని, ప్రాసాదవాసము సర్వప్రకృతు లకును సుఖకరము కాదు. దేశకాలపాత్రములే వస్తు గుణవికాసహేతువులు. ఎట్లన,

గీ. సరసున సరోజతతి వికాసంబు గాంచు
మలయపర్వతమందున వెలయుఁ జంద
నంబు; వస్తువు లిట్లు స్థానమును బట్టి
వర్ధిలుచునుండు నశియించు వ్యత్యయమున. ౨౮

మఱియు,

గీ. చెట్లు చిగురించు మధుమాససిద్ధితోడ
నమిలి నర్తించు వర్షర్తునం గడంగి

హంస శరదాగమమునఁ గూడుం దనెడంగఁ
గాలమున సర్వముఁ గుణకలితము లగు. ౩౧

రాజు:—అయిన నో కుమారులు లాయుస్త్రద్వయమును నేన్వెకయే నావలె యుద్ధము నెఱపుదురు.

విశ్వా:—అట్లనుట మంచిది కాదు.

రాజు:—మఱి యెట్లు?

విశ్వా:—నాయాచన వ్యర్థము కాకుండఁ దీర్చుదో నిన్నొక్కటి యడిగెదను.

రాజు:—గీ. చరము నచరము నాసర్వ మనయు మీదె
నాది యనఁ దగునది మునినాథ! లేదు.
ధన్యుఁ జేయుము కొని యీాప్సితంబు లెల్ల,
నర్థులకుఁ గానిసంపద వ్యర్థముకద! ౩౨

విశ్వా:—నేను నిన్నేది కోరుదునో యది తీసికొని వెంటనే వనమున కేఁగుదును.

రాజు:—ఆజ్ఞాపింపుఁడు.

విశ్వా:—రాముని యాచింతును.

రాజు:—ఎందుకొఱకు?

విశ్వా:—ఈయఁదలఁచినవా రిచ్చెడుదానిఫలము పృచ్ఛకొను వారి నడుగరాదు.

రాజు:—అది ధనాదులవిషయమున.

విశ్వా:—మాదృశు లగుఋషులు ధనాదులు కోరరు.

రాజు:—రాముఁడు నాప్రాణముకదా?

విశ్వా:—ఐన నేమి? మహాత్ము లడిగిన నో ప్రాణ మీాయఁ గూడ దని యెచట నున్నది?

రాజు:—రాముని కేల నన్నును దీసికొని పొండు.

విశ్వా:—నీ విచ్చినది మరల మఱియొకని పేక్షమున నిపేక్షింపఁ జూచెదవేం?

రాజు:—గీ. కారణము లేకయే రాముఁ గాననమున
కంపి తమతోడ నొంటి నేకరణి గృహము
నందు నివసింతు మునివర్యు లైన మహాత్మ!
జీవితము నెట్లు నిల్పుదుఁ జెప్పు దేవ! ..౧౭

విశ్వా:—కారణము లేకయే యనుట పాడి కాదు.

రాజు:—ఐనఁ, గారణ మేమి?

విశ్వా:—పదిదినములలోఁ బూర్తి యగుయజ్ఞ మొకటి నేను జేయుచున్నాను.

వసి:—ఈకాలమున యజ్ఞ మేమి?

విశ్వా:—గీ. యజ్ఞదానతపంబుల ననవరతము
చేయుటయె ధర్మ మెల్లరు శీఘ్రగతిని;
సర్వదా వీనిఁ జేయఁగాఁ జాలనట్టి
వారికై కాల మన్న దేర్పడియె నిజము. ౧౮

ఆనాయజ్ఞము శస్త్రసాహాయ్యము లేనిది విజయసంపతము కాదు. సర్వశస్త్రవిదుఁ డగురాముఁడే యజ్ఞము నిర్విఘ్నముఁ గావింపఁగలఁడు.

రాజు:—మీయజ్ఞమునకు విఘ్నము లెట్లు కలుగును?

విశ్వా:—మారీచసుబాహుప్రముఖు లగురాక్షసులనుండి.

రాజు:—నేను సైన్యసహితుఁడనై వచ్చి వారిని సంహరించెదను.

విశ్వా:—రాముఁడుతక్క నొరు లందులకు సమర్థులు కారు.

రాజు:— గీ. రాక్షసులు నిర్దయులు బలరాజితులును
రాముని పదంబు లెద మృదురమ్యము లగు
నెటులు రక్షించు యజ్ఞంబు నితఁడు కట్ట
వనజము వనాగ్ని నార్ప సంభవమె ? దేవ ! ౨౯

విశ్వా:— రాజా
శా. బాలార్కుండు త్రిలోకసంవృతతమోభంగంబు గావించు; ను
ద్వేలం బైనమృగేంద్రపోతము వనిన్ బీభత్సముం జేయఁగాఁ
జాలున్, రాముఁడునట్లు రాక్షసదవజ్వాలాయితుండై భువిన్
బాలించున్ వయు సెన్న నేల తలఁపన్ శౌర్యప్రభారాశికిన్.

మఱియు,
గీ. తొలుతఁ దెల్పినదివ్యాస్త్రములను రెంటి
రామునకుఁ దెల్పెదను నేను గ్రతుసమాప్తి
యైనపిదపఁ బ్రియంబున నందువలన
నుత్తరోత్తరసత్ఫల మొదవు నమ్ము. ౩౧

రాజు:— అట్లైన గురువు లగువసిష్ఠభగవానుల నడుగుదును.
(వసిష్ఠునితో)
గీ. దేవ ! సెలవిమ్ము నేఁ జేయు తెఱఁ గదేమి ?
తావకాజ్ఞను బాలింతుఁ దక్షముగను
ధర్మహానియు సుతపరిత్యాగ మదియు
రెండు దుస్సహములె నాదునిందుమదికి. ౩౨

విశ్వా:— రాజసింహ ! ప్రతిజ్ఞాహాని మహాపాతకము. నాతో
రాముని బంపుట పుత్త్రిత్యాగము కాదు.
వలన;

గీ. ఎంతప్రియుఁడో రాముఁడు నీకు నంతకంటె
నెక్కుడు ప్రియుండు నాకును; నింత కతఁడు
నూతనాస్త్రమహావిద్యఁ బ్రీతిఁ గాంచి
సత్వరంబుగ వచ్చు నీసన్నిధి కిట. 33

వసి:—విశ్వామిత్రుని వెంట రాముఁ డరిగినచో నెట్టియనిష్టము కలుగ దని నాకుఁ దోఁచుచున్నది. నీకుఁ బ్రతిజ్ఞా భంగము కాఁగూడదు. రాముని బంపుము. సందేహింపకుము.

రాజు:—అట్లే చేయుదును. (రామునితో గద్గదముగా) వత్సా! రామా! భగవానునితోఁ బోయి రమ్ము.

రాము:—(నమస్కరించి) తమసెలవు.

లక్ష్మ:—(లేచి) తండ్రీ! గురుదేవా! భగవానుఁడా! నే నార్యు ననుగమింతును.

మ. జననీస్తన్యము లానువేళలను దత్సాన్నిధ్యమందే ప్రియం
బునఁ గేళిగతులన్ జెలంగునెడలన్ బూతాస్త్రవిద్యాదికం
బును నేర్వంగనువేళ నాశిషములన్ బొల్పొందువేళన్ సదా
యనుసరించితినార్యు నేఁడడవి కేలా? యొక్కఁడే పోవఁగన్.

విశ్వా:—గీ. గడియ యైనను రాముని విడువ వీవు
రమ్ము రామునితోడ వనమ్మునకును.

భరతశత్రుఘ్నులు:—

మమ్ము విడనాడి మీరు వనమ్మునకును
బోవ మేమును వత్తు మాపూతవనికి. 34

రాజ:—(కన్నీటితో) ఏమి? అందఱును వెళ్ళుదురా?

వసి:—విశ్వామిత్రునితో రామలక్ష్మణులు లేఁగుదురు. ఇతరు

లిరువురు వృద్ధుఁడగుతండ్రికి సేవ చేయుచు నిటనే యుండుదురుగాక !

రాజు:—(కన్నులు మూసికొని) అట్లగుఁగాక ! లక్ష్మణుఁడును బోయి వచ్చును.

రామలక్ష్మ:—మే మిపుడే భగవానునితోఁ బోవలయునా ?

విదూ:—(అపవారించి రాజుతో) ఈదీర్ఘకూర్చ నిపుడే పోసిండు. ఇంకను నున్నచో రాణులను గాని నన్నుఁ గాని కొనిపోఁగలఁడు. రాణులను గొనిపోవుచో నాకు మోదకతృప్తి చేకూరదు. నన్నుఁ గొనిపోవుచో రాక్షసులు నమలివేయుదురు.

విశ్వా:—కుమారులారా !

గీ. తల్లులను మిత్రులను నూఱడిల్లఁ జేసి
యపుడు ప్రస్థానమంగళ మాచరింపఁ
జేయుఁడీ మీరు మనములఁ జేర్చి శాంతి
యుదయమున వని కేతేర నుండవలయు. 36

రామలక్ష్మ:—చిత్తము.

రాజు:—అమాత్యా ! వీరి నందఱను విశ్రమింపఁజేయుము. నాహృదయము పర్యాకులముగా నున్నది. అంతఃపురమున కేఁగుదును. విజయా ! దారి చూపుము.

ప్రతీహారి:—మహారాజా ! ఇటు, ఇటు.

(విశ్వామిత్రుఁడు తక్క నందఱు నిష్క్రమింతురు.)

విశ్వా:—కోరినకోరిక సిద్ధించుటచే మనసు కుదుటఁబడినది.

గీ. చేయుదును రాము నే నద్వితీయుఁ గాఁగ
నస్త్రవిద్యల నసురుల నణఁగఁగొట్టి

రావణుని శక్తి మంత పరాక్రమంబు గాంచి
తోష మందెదఁ గార్యసిద్ధుండ నగుచు. 38

(౧౯౧-౯ సంగము)

ఇది చతుర్థాంకము.

---

## విష్కంభము iii

[ముగ్గురు ఋషిశిష్యులు ప్రవేశింతురు]

మొదటి:- గీ. బ్రహ్మఋషి యైనకౌశికుక్రతువు నేఁడె
పూర్తి యైనది కామ్యసంపూర్తి నొసఁగి
తత్ఫలంబుగ నిర్భయత్వంబుతోడ
మనుచు నుంటిమి సత్తపోవనమునందు.

రెండవ:— మిత్రమా! శాలంకాయనా! ఈయజ్ఞఫలము శుభప్రదమే యైనది. ఈపాడ్యమినాఁడు వనములో నిర్భయముగా మనము తిరుగఁగలము.

శాలం:— గాలవా! ఈతపోవనమున మారీచుఁడు మున్నగు రాక్షసులు విశ్వామిత్రాదులజోలికే కాని మనవంటి వారిజోలికి రాకపోయినను మనకు మిక్కిలి భయముగా నుండెడిది.

మూఁడవ:— విశ్వామిత్రాదులనే కాని యన్యులను వారేల పీడింపరైరి?

గాల:— తామ్యాయనా! విశ్వామిత్రుఁడు పూర్వము క్షత్రియుఁడు. తపముచే నతఁడు బ్రాహ్మణత్వము నందెను. అప్పటినుండియు నతని బ్రహ్మత్వమును బ్రాహ్మణుల

సహింపఁజాలరైరి.

తాముర్వ్య:—ఏల, రాక్షసులు తపోవిఘ్నము కలిగింపఁ గారణ మేమో ?

గాల:—రాక్షసరాజైన రావణుఁడు విశ్వామిత్రుని తపోభంగము నకు వారిని నియమించియుండెను.

తాముర్వ్య:—రావణునకు విశ్వామిత్రునిపైఁ గోప మేల ?

గాల:—విశ్వామిత్రుఁడు బ్రహ్మత్వమున నెంతవఱకుండఁగలఁడని.

తాముర్వ్య:—అనఁగా ?

గాల:—ఏదోరీతిని విశ్వామిత్రునకుఁ గోపము రప్పించినచో శమప్రధాన మగునాతని బ్రహ్మర్షిత్వము పోల్పోఁగలదని.

తాముర్వ్య:—ఆయన శాపముచే రాక్షసుల నివారింపరేమి ?

గాల:—కోపించినఁగాని శాపము రాదుకదా !

తాముర్వ్య:—ఎందఱో ఋషులు కోపించినవారు గలరు. వారి బ్రహ్మర్షిత్వమునకు లోపము రాలేదే ?

గాల:—పరంపరాప్రాప్త బ్రహ్మర్షిత్వమున కప్పుడప్పు డిచ్చిన శాపములవలన లోపము కలుగదు. ఇతని దచిరప్రాప్త బ్రహ్మర్షిత్వము. కావున, లోపము కలుగ వచ్చును. అందుచే విశ్వామిత్రుఁడు రాముని సహాయునిగాఁ దీసికొనివచ్చినాఁడు.

తాముర్వ్య:—ఏమో. ఇతరసాహాయ్యాపేక్ష యగుసీతనితప శ్శక్తి బ్రాహ్మణునకువలెఁ బరిపూర్ణము కాదనుకొందును.

శాలం:—అది సరి కాదు. ఏలన,

గీ. యజ్ఞసంరక్షణంబున కనెడుమిషను
రామచంద్రుని గొని తెచ్చె నీమహాత్మ

దివ్య మగునస్త్రముల మంత్రదీపితముగ
నతని కుపదేశ మొనరింప నభిలషించి. ౨

ఇట్లు,

చ. గమనముచే మృగేంద్రుని, మొగమ్మునబాలమరీచిబింబముం
సుమధురవాక్కులం సుధను, శుద్ధగభీరతచే సముద్రు, న
త్యమలినరూపసంపద ననంగుని, నున్నతిచే హిమాద్రి, ను
త్తమతరశౌరతం హరిని దప్పక రాముఁ డధఃకరించెడిన్. ౩

గీ. ఇతఁడు వచ్చిన దాదిగా సీతపోవ
నము నొనర్చెను సుతపోవనమ్ము గాఁగ;
కాంచఁగంటిమి కన్నులు గలఫలంబు
సితనిపూర్ణాకృతిని గాంచి యింపు మీఱ. ౪

గాల:—ఔను. రాముఁ డలోకసామాన్యబలశాలి. రాక్షసులు మాయారూపధరులై రాత్రివేళ రాఁగా నాతఁ డొంటరిగా నిలిచి వారి నెల్లరఁ జంపి యజ్ఞమును సంరక్షించినాఁడు. మారీచసుబాహులు రావణాసురుని యనుచరులలో మహాబలవంతులు. వారు నిత్యము విశ్వామిత్రుని దృణసమానముగాఁ జూచెడివారు. రాముఁడు వారిలో నొక్కని జంపి రెండవవానిని బాణములతో నెగురఁ గొట్టఁగా వాఁడు పోయి పోయి సముద్రమునఁ బడెనఁట.

తాప:—ఈతఁడు తాటకి యనురక్కసిని జంపినట్లు చెప్పుదురు. నిజమా?

గాల:—నిజమే.

మ. కుసుమంబుల్లతనుం జిత్రయింపఁ గడుసంకోచించునీయుత్తమాం
గసమానాస్త్రంబులఁ జంపెఁ దాటకను హాహాకారము ల్సేయఁగా
వెసఁ గించిచ్ఛ్రియ నైనస్వేదకణికావిస్తార మూనమిన రా
క్షసశస్త్రక్షతినస్త్రము ల్గురియ నిష్కంపప్రభావాఢ్యుఁడై.

ఇట్లు మహానుభావులు

క. మృదుభావకఠినభావము
లెదలందునఁ దాల్చుచుందు రేకాని కడుఁగా
వెదకినను దోఁపనీయరు
కద! యార్యులు గూఢభావకలితులు ధరణిన్. ౬

శాలం:— రామలక్ష్మణులు పూజనీయు లగుట కేవలము దయ చేతను శౌర్యముచేతనే కాదు. ఋషిగణవినుత మైన శాస్త్రపరిజ్ఞానముచేతను వారు మనల నెల్లరిని మించుచున్నారు.

తామ్రా:— ఏల యిట్లు స్తుతింతువు? వారు రాజపుత్త్రు లనియా? వారి కెప్పుడును జక్కని కమ్మని భోజనము, దాసులసేవ, తలిదండ్రులలాలనము, వైద్యుల యుపచారములు, ప్రేమతోఁ గొట్టక తిట్టక చదువు నేర్పు గురువులు, ఇఁక వారికిఁ జదువు వచ్చుటలో వింత యేమి? మనము రోగమువచ్చినను మానక గురుసేవ నిత్యమును జేయుదుము. భిక్షకుఁ బోవుచునేయుందుము. దానంతట నది యెంత లభించిన, దానితోడనే జీవయాత్ర గడపుదుము. గురువులకు భయపడుచుందుము. నేలమీఁదనే పరుందుము. పాఠము చదువుకొనుటకే మన కవకాశము కుదురదు. ఇట్టిమనయల్పవిద్య వారి

యుద్ధకవిద్యకంటెఁ బ్రశస్తమైనవి. మనగురువులు వారిని నుతింపుట రాజపుత్త్రులనియేకాని విద్యఁ జూచి కాదు.

గాల:—ఓరీ! మూర్ఖా! గురువుల నాక్షేపింప రాదు.

తామ్యా:—నిజమైనమాట చెప్పితినే కాని యాక్షేపింప లేదు.

శాలం:—గురువులకు నిందకలిగించువచనము సత్యమైనను బలుక రాదు. వినరాదు. గురువు లనాలోచితముగాఁ నే పనియుఁ జేయరు.

తామ్యా:—ఐనవో, గురువులు స్వలాభ మపేక్షింతురే కాని గుణ మపేక్షింప రన్నమాట.

శాలం:—ఓరీమూర్ఖా! నీవచనములలో నాస్తిక్యము తోఁచు చున్నది. మే మింక వినఁజాలము.

తామ్యా:—సత్యవచనములకు సమాధానము చెప్పలేక నాస్తిక వచనములుగాఁ ద్రోసివేయుదురు.

శాలం:—అజ్ఞానచేతస్కులు పేరులిడ్డఁ జూపినను శాంతింపరు. (చూచి) ఆహా! రామలక్ష్మణులు తన్ననుసరింప విశ్వామిత్రు లిటకే విచ్చేయుచున్నారు.

గాల:—(చూచి) ఔను. విశ్వామిత్రభగవానుఁడే.

గీ. రాజపుత్త్రులతోఁ గూడి ప్రాఁజదువులగు
బ్రహ్మమయులు విశ్వామిత్రపరమఋషులు
వచ్చుచున్నారు శ్రుతతపోభరితమైన
వేద మిట్టులు మూర్తిభవించె ననఁగ. 2

(నిష్క్రమింతురు)

ఇది శుద్ధవిష్కంభము.

---

# యజ్ఞఫలము

## పంచమాంకము

[అంత రామలక్ష్మణులతో విశ్వామిత్రుఁడు ప్రవేశించును]

విశ్వా:—వత్సలారా! రామలక్ష్మణులారా! విద్యాస్త్రములు మీరు నాకడ గ్రహించి యజ్ఞమును రక్షించినారు. రక్కసు లుక్కడఁగిరి. నా కెంతో సంతోష మైనది.

గీ. ఎంతసుక్షేత్రమున నైన నిడినధాన్య
మొక్కనెలనైన సుఫలంబు నొసఁగలేదు
ఇపు డొసంగినయస్త్రమ్ము లిపుడె నాకు
నుత్తమఫలంబు నొసఁగె శుభోదయముగ. ౧

రాము:—మేము మీయాజ్ఞఁ బాలించి మీబహుమాన మందితిమి ధన్యులము. ఉత్సాహమును బురికొల్పుటకు గురువులు శిష్యు లెంతసామాన్యు లైనను వారిని నుతింతురు.

విశ్వా:—ఓయీ! రామా!

గీ. ప్రబలరాక్షసఘాతశౌర్యప్రసిద్ధ
వీరుఁడవు; రావణశ్రీవికారహేతు
భూతుఁడవు; నేను జాలకపోయినట్టి
పని యొనర్చితి వాసురభంజనమున. ౨

రాము:—దేవా! మీతపోబలముచేతనే మేము రాక్షసులఁ జంపఁగలిగితిమి. లేనిచో, మహాబలవంతు లైనను

జయింపఁజాలని రక్కసు లెక్కడ? కసుగందుల మగు నే మెక్కడ?

గీ. అరుణకాంతులు చీకట్లు నణఁచు ననుచు
జనులు తలపోయుదురు గాని సత్య మరయ
నరుణశాలకు ముందుంచి యాత్మ తేజ
మట్లు ప్రసరింపఁ జేయుఁగాదా? యినుండు. 3

విశ్వా:—వత్సా! నిజమే. కాని,

మ. మొలచున్నామి మహౌషధు ల్తమరసంబుల్మిఱుఁగాఁగానిభూ
స్థలి కల్పించునె యోషధీతతికి నిష్టం బౌరసం బెన్నఁడేఁ?
వెలయుం దీయఁదనంబె యిక్షువున నావేశించి ప్రత్యేకమై
యిలనిట్లోగురుప్రోల శిష్యమహిమంబే మిన్నయై చెన్నగున్.

నే నస్త్రముల నిచ్చితిని. . మి మ్మాశ్రయించి యవి మీమహిమవలన రాక్షసవినాశసమర్థము లైనవి.

రాము:—నిజముసకుఁ దమయస్త్రములను జక్కఁగా నుపాసించినవాఁడు లక్ష్మణుఁడు. తటస్థుఁడనై యున్నను నా కాతనిగౌరవము తక్కినది.

లక్ష్మ:-భగవానుఁడా! మాయశమునకు హేతుభూతు లగు మీరు దయతో నల్ప మగుమాయుద్ధమును గౌరవించుచున్నారు. సర్వరాక్షసనాశనము చేసినయార్యుఁడు నన్నభినందించుచున్నాఁడు. కానిండు. బాలుఁడ నైననే నొనర్చినయుద్ధమును బ్రశంసించు నెడ నది మీ వాత్సల్యమునకు ఫలమే కాని యన్యము కాదు.

రాము —దేవా! రావణశ్రీ విరూపిత మైనట్లు చెప్పితిరి. సుబాహుమరణముచేతను, మారీచపరాజయముచేతను

సది యెట్లు సంభవించును ?

విశ్వా:-వత్సలారా ? వివిధాస్త్రశస్త్రప్రభృతులు, మాయా రూపులు, మహాబలులు నగుసీమారీచసుబాహులు వైవస్వతక్షత్త్రిశాసిత మగుసీప్రదేశమునఁ దపోవనము నందు సేనానివేశము కల్పించుకొనిరి. ఈయిరువుర నెవ్వరు చంపుదురో వారివలననే తనకు మరణ మగు నని రావణునినిశ్చయము. నేఁడు సుబాహుఁడు మరణిం చుటచే రావణశ్రీ విరూపిత మైనది. మారీచపరాజయ మువలన రావణరాజ్యలక్ష్మికి వైధవ్యసూచక మగు పాణిరేఖ జనించినది.

రాము:-రావణుఁడు మహాబలుఁ డని వింటిమి. ఆతనితోఁ గూడ యుద్ధము చేయవలసియుండు ననుకొందును.

విశ్వా:-నిజము. ఆతఁడు మహాబలుఁడే కాని, యల్పుఁడు.

గీ. త్వాదృశులకీర్తి వీసులు దాంతులు నగు
వారు మెత్తురు సైఁప రల్పజ్ఞు లెపుడు
తనకు నొకనాఁడు నీకు నాతనికి యుద్ధ
మిలను నిలుచు విరుద్ధశక్తుల నొకండె. ౫

రాము:-నే మొకరి నొక రెప్పుడును జూచియుండ లేదు. పర స్పరాపకారము లెఱుఁగము. మఱి మా యిరువురకు విరోధ మెట్లు కలుగును ?

విశ్వా:-గీ. ఏల పంచాస్య ముఱుము సహింపకుండు
నదియె యేన్గుల నేల చెండాడు నడవి ?
ప్రకృతి యిది వీరు లన్యప్రభావ మింత
సైఁప నొల్లరు కానిచోఁ జత్తు రిలను. ౬

రాము:-వానికి నాకు యుద్ధ మేల వచ్చును ? ఎవరు గెల్తురు ?

విశ్వా:-గీ. ధర్మవైషమ్య హేతువు తనర నెపుడొ
వానికిని నీకు యుద్ధంబు వచ్చు నిజము;
అందు సందేహ మేల విఖ్యాతభంగి
నీకె జయ మగు సాధుప్రసీతభావ ! ౭

రాము:-ధర్మవైషమ్య మెట్లు కలుగును ?

విశ్వా:-రావణుఁ డధర్మరాక్షసాధిపుఁడు. ఇక్ష్వాకువంశజుఁడ వైననీ వాశ్రమధర్మసంరక్షకుఁడవు. అతఁడు ఋషిజనాపరాధి. నీవు ఋషిపూజాపరుఁడవు. అతఁడు బలగర్వితుఁడు. నీవు వినయశీలివి. అతఁడు స్వబలప్రధానుఁడు. నీవు ధర్మప్రధానుఁడవు. అతఁడు భ్రాతృశత్రువు. నీవు సౌభ్రాత్రుఁడవు. ఈ వైషమ్యములచే యుద్ధము సంభవించును. స్వయంకృతాపరాధమునసే యాతనికిఁ బరాజయము నీవలననే యగును.

రాము:-దేవా ! యుద్ధమే సంభవించినచో మీ రన్నట్లు నాకు విజయము తప్పదు. ఏ మందురా ?

క. గురువులయాశీర్వచనము
పురజనసంప్రీతి మంత్రపూతాస్త్రంబుల్
మఱి లక్ష్మణసాహాయ్యము
దొరకెను నా కింక జయము దుర్లభ మౌనొకో ? ౮

విశ్వా:-నిజమే. మీయిరువుర నెప్పుడును విజయమే వరించును. మీయుభయులతో రణమునకుఁ దొడఁగిన యముఁడును నిర్బలుఁ డగును. నీకును రావణునకును యుద్ధము కొంతకాలమునకు వచ్చును. రావణుఁడు

కారణము లేక యుద్ధమునకు దిగఁడు. నీవును నయ వినయసంపన్నుఁడవై యెన్నఁడు నల్పకారణమును గణింపవు దీని కేమి కాని, రామచంద్రా! నీచే నెలయింపఁబడిన శాంతి నేఁడు తాపసులయందే కాక, పశుపక్షివృక్షాదు లందును గాన్పించుచున్నది. చూడుము. అదిగో! ఆమునిబాలకులు ప్రసన్నులు నిర్భయులునై మహాబల వంతుఁడు తమకు రక్షకుఁ డయ్యెఁగదా యని నిర్వ్యాపార ముగా నాడుకొనుచున్నారు. సరోవరములు ప్రసన్న గంభీరములై యున్నవి. ఆహా! అందలిమీనకిశోరము లెంత మనోహరముగా సంచరించుచున్నవి! ఆసరో వరము ప్రసన్నతరంగహస్తములతో మనల నాహ్వా నించుచున్నది. చూడుము. రామా! [నీయఁగా;

చ. వనమున ప్రత్యవిఘ్నములు వాయఁగ, నింద్రుఁడు వృష్టి
వినుతము నీసమృద్ధి కనిపింపఁగ సస్యము పండఁగా; సరో
వన మతినిర్మలంబు సుఖవంతము పుష్కలమై చెలంగఁ జెం
పును గను భూమి నీదయ సభూరిపరాక్రమరక్షణంబునన్.

రాము:—ఆహా! ఈతపోవనరమణీయత యెంతని కొనియాడు దును?

గీ. ఫలభరవినమ్రబహుపాదపాళి సస్య
సమితి మును జూచితిని నగరముల దరిని
గాని, యిట్టియపూర్వసౌఖ్యప్రదంబు
రామణీయకముం జూచినామె యెపుడు? ౧౦

విశ్వా:—నగరములందలిరమణీయత కృత్రిమము. సర్వభోగ్యము కాదు. కావున సనహజము. ఎట్లన,

శా. ఆరామంబులుఁ గేళిభూధరము లత్యంతప్రయత్నంబులన్
బౌరుల్ పెంచి భజింత్రు నట్టివులశోభాహీనభంగిన్ వన
శ్రీరమ్యత్వముఁ గాంచ వయ్యవి; మృగశ్రేణిన్సదా చెంతకున్
జేరం ద్రోలుదు రొక్కయాకయిన వాని న్మట్టనీకుండఁగన్.

గీ. మృగము లేపంటపొలముల మేఁతకొఱకు
వచ్చినను ద్రోల రిట కృషీవలులు కరుణ;
నగరసంపర్క మెఱుఁగ రన్నంబు నమ్మి
నిచ్చగింపరు ప్రజలు ధనేచ్ఛఁ దవిలి. ౧౨

లక్ష్మ:—భగవానులు సరిగాఁ జెప్పిరి. ఏలన, నాగరకులు,

గీ. పురి మహోన్నతసౌధాదిభోగములను
ననుభవింతురు కళయె ముఖ్యంబు గాఁగ
వైరశూన్యంబు సహజసంపద్యుతంబు
విజనవనసౌఖ్య మెఱుఁగ రేవేళనైన. ౧౩

మఱియు,

గీ. పురములోఁ గృత్రిమంబు మత్సరయుతంబు
దుఃఖదం బౌను సర్వ మిందునఁ దలంప
వాస్తవికమును బ్రకృతిశోభామహత్త్వ
వాసితం బయి వఱలు సర్వము మహాత్మ! ౧౪

రాము:—దేవా!

శా. బాలార్కప్రతిబింబశోభల సరోంభఃపూర మేపారు, సు
శ్రీలంబై యపమేఘమై విమలమై చెల్వొందు నాకాశ,మా
శాలోభాదివిహీనసన్మునిజనస్వాంతోపమం బీయుగం
బోలిన్ నైజశుభప్రభావినిమయోదోద్యోగంబునం దోఁచెడిన్.

విశ్వా:—వత్సలారా!

చ. విరహిణులట్లు నిర్మలత వీడి యడంగనదెక్కు డల్ల దే
యరుణునిరాకకల్మి జలదావరణంబుల వీడి పొంగెడిన్
సరసిజనేత్ర తానములు స్రస్తదుకూలముఁ గట్టిపోల్కి సుం
దరచలదూర్మిహస్తములఁ దాఁకుఁ దటంబు నిరంతరంబుగన్.

రాము:—ఇందలిస్వచ్ఛసరోవరజలములఁ దోఁచుసూర్యబింబము మహానిమానసమునందలివిజ్ఞానమువలె భాసించుచున్నది. హింసాహీనములై పక్షులు తీరమున యోగులవలె శాంతిసుఖ మందుచున్నవి.

లక్ష్మి:—గీ. సరసులోనియగాధంబుజలములోన
నెసఁగు నుత్తమమానసౌకసము లవ్వొ
సకలరసపూర్ణకవిచిత్తసద్మమందుఁ
బరగునుజ్జ్వలనూత్నభావములభంగి. ౧౭

రాము:—ఇది చాల యుక్తముగ నున్నది.

ఉ. కేకులు ఘూమయోనికి స్వకీయమహోన్నతనృత్తవైభవో
ద్రేకము చూపి స్వాగతముదీర్ణత నిచ్చె నినుంపు ఛన్నుఁడో
వేకువవేళ, మేఘములు విచ్చినవెంటనె దీప్యమానుఁడై
పైకి నినుంపు రా నెమిలిపక్షము రాలుట న్యాయ్యమేకదా!

విశ్వా:—వత్సలారా! ఈశరత్కాలశోభ యింకను జూడుఁడు.

గీ. ప్రబలశత్రుఘనాంధకారమ్మునందు
నడఁగి యుఱుములు మెఱుపుల నడలుసనుఁడు
నిర్మలాకాశమునఁ బొల్చె నేఁ డతసని
గాశవీజనముల శరత్కాంత కొలుపు. ౧౮

మఱియు,

ఆ. మేఘపటలి వాయుమింటు జిగ్గిజయి యూం
ప్రభుండువోలె మించుపద్మహిత్తుసిం
బ్రజలువోలె సమలుం బద్మాకరంబులుం
జూచుం బద్మనేత్రశోభ నెలయు. —౨౦

ఇటు మన కీతపోవనమున శరత్సుషమ సాక్షాత్కరించినది. అతిరమ్య మగుటవలన నిది నిత్యనూతన మగుచున్నది. తపోవనాంతికమున వన్యఘోషమును గనందగినదే. నగరసమీపమందలి గొల్లపల్లెలవలె నిందలిపల్లెలు న్యవహారాకులములు కావు. ఇందలిజనులు మృగసమాన వృత్తులైన యాత్మధర్మముల నెఱుంగనివారైనను నధర్మము మాత్ర మాచరింపరు. పరస్పరవైరములు, పరధన కాంక్ష యే రెఱుంగరు. గ్రామీణస్త్రీలు నిత్య మాతిథ్య పరలు. అపకారముసైతము పే రతిశీఘ్రముగా మఱతురు. మిమ్ము వా రభినందింపఁగలరు. చూచెదరు గాక.

రాము:—అట్టివారిని దప్పక చూడవలయును.

లక్ష్మ:—మనస్సులు శరీరములుకూడ వనశోభచే నాకర్షింపఁ బడుచుండఁగా మనము చాలదూరము వచ్చితిమి. ఇపుడు నిసర్గము, ఆర్జవానుకృతము నగుతపస్విచరితము భగవాను లన్నట్లు ప్రత్యక్షముగాఁ జూడఁ గందుము.

(అందఱు పడతురు)

లక్ష్మ:—(చూచి) ఆర్యా! చూడుము.

గీ. సస్యభారనతంబులై స్వర్ణకాంతి
నలరుకలమపు లెన్ని లోరార! యిచటఁ

దల్లియుఁ క్షేత్రభూమికిఁ దగ నుపాయ
నమ్ము లిడుచున్నయట్లు గన్పట్టుచుండె. ౨౧

విశ్వా:-ఆయెదుటఁ గూర్చుండియున్న కృషీవలులఁ గంటిరా? వారు క్షేత్రములు చక్కఁగా దున్ని చదునుచేసి యాకుమళ్ళు పెంచి దమ్ముచేసి వర్షము కురియఁగా నూడ్చి పిదపఁ గలుపుతీసి రేయింబవళ్ళు కనిపెట్టుకొనియుండి శ్రమఫలము లగుసస్యములఁ గోసికొందురు. ఈక్షేత్రోపజీవు లింద్రభోగముల నైనను దృణప్రాయములుగాఁ దలంతురు. వారి కెవ్వ రీడు రారు. కష్టఫలమును గను ఘనులు ధన్యాత్ములు నిజముగా వారే. ఈరీతిఁ బండిన సస్యములో

ఉ. దైవతపైతృకక్రియ లతంద్రదన్నపాతిథిబంధుమిత్రసే
వావిధియుక్తభాగములఁ బంచుచు ధాన్యమునున్నదానితోఁ
బావనభంగి బిడ్డలను భార్యలఁ బెంచుచు భూమినుండియే
భావిఫలంబుఁ గోరుచు శుభస్థితి నుండుదు రీకృషీవలుల్.

లక్ష్మ:-ఈకృషీవలులచరిత్ర మతిశ్లాఘ్యము.

విశ్వా:-నిజము. ఏ మనిన

గీ. శ్రమ గణింపక దైవవిశ్వాసమునను
దొరకినది తృప్తిగాఁ దిని దోషభావ
రహితులై మిక్కిలి సుఖింత్రు రమ్యభంగి
సర్వజీవితహేతువుల్ సజ్జను లయి. ౨౩

అంతేకాదు. వారికి

గీ. క్షేత్రమే కర్మభూమి కళత్రసుతులె
సర్వలోకము సర్వదా సౌమ్యధేను

జాల మది బంధుతతి యథాశక్తి మఱియు
నతిథిపూజయె ధర్మ మీనుతగుణులకు. —౭౪

రాము:—ఆహా !

చ. శ్రమపడఁ గల్గినట్టిఫలసంగతి స్వల్పమె యయ్యు వార లు
త్తమమగుతృప్తితోఁ గాని సదా ముదమందుచు జీవయాత్రని
ర్వ్యము లయి పుత్రు రెన్నఁడుఁ బరస్పరవైరము లేక దాంతులై
యమలినమానసాబ్జులయి యాదుకుపూజ్యులు సర్వరీతులన్.

బహుగుణవంతు లయ్యు వీరు తమ్మధములుగానే తలఁచుచుందురు. వీరిలోఁ గొందఱిని నగరమునకుఁ దీసికొనఁబోనఁ దలఁపు కలుగుచున్నది. అట్లు చేసిన యెడల నిజముగా నగరములు నాకపురములను మించి తపోవనతుల్యము లగును.

విశ్వా:—నగరమునకుఁ గొనిపోయినచో వీరికి సర్వగుణములు వినష్టము లగును. వీ రటఁ గృషిమాటయే మఱతురు. ఇచట నిగర్వులై యున్నవీ రచట మహారాజునైనను లెక్కింపరు. అభ్యాగతసేవాపరాయణు లగువీ రచట దాంభికులై తమవారినే మన్నింతురు. అచట వీరికిఁ గ్రమముగా నగరదోషము లంటును. ఎవ రెచట నుండుట సహజమో వా రచటనే యుండుట గుణకరము. తమపనులఁ దాము చేసికొనుచు దురాశావిహీనులై యున్నవీరి నిచ్చటనే గౌరవింపఁ దగును. రాజువలనను నాగరకు లగుపౌరులవలనను నేబాధయు లేక వీరు సుఖించునట్లు మహారాజ వగునీవు యత్నించినఁ జాలును.

రాము:—భగవానులు పరిణామదర్శులు. అందఱకు స్థిర మగు

సుఖముఁ గోరుచుందురు.

లక్ష్మ:-భగవానుఁడా! గ్రామీణగుణకర్మవ్యవహారము వన శోభతోఁ గూడ నింకను గనఁ గోరుదును. కన్నుఁ గాని నేత్రములకుఁ బూర్ణతృప్తి లేదు. పర్ణశాలను దాఁటి దూరము వచ్చితిమి. అస్తాద్రిశిఖరమున నస్తపదుఁ డైన దివాకరభగవానుఁడు రేపు మరల నుదయించుటకు నేఁటి చరమప్రభుత్వముఁ జూపించుచున్నాఁడు.

గీ. అస్తమింపఁగ నుండియు నర్కకరము
లస్తగిరిశిఖరంబులయందు నిలిచె
మంద తేజస్కు లయ్యును మహితు లవని
వదల రాత్మీయ మహామహత్త్వంబు నెపుడు. ౨౬

విశా:—నగరనివాసు లగుమీకు గ్రామ్యశోభ యింకను నూతనముగనే యుండును. మనము ప్రతిదిన మిచ్చటికి రాఁజాలము కావున నదిగో! ఆకుల్యయందు సాంధ్యకృత్యములు నిర్వర్తించుకొని గ్రామస్థులయాతిథ్యము స్వీకరించి రాత్రి యచటనే కడపుదము.

లక్ష్మ:—చిత్తము. (అందఱును నడతురు)

రాము:—ఆహా! వనమునుండి గోగణములు తిరిగివచ్చునీదృశ్య మెంతరమణీయముగా నున్నది! ఈగోవులు

గీ. నడల నడవిఁ బవిత్రత నడరఁ జేసి
మేసి వివిధౌషధులఁ దృప్తి మీఱ నింట
బుడుతదూడలకును బాలు గుడువఁ బెట్టఁ
గదలివచ్చెడి మెలమెల్లఁ గదుపుకట్టి. ౨౭

లక్ష్మ:—ఆర్యా! బాగుగాఁ జెప్పితివి.

గీ. వత్ససందర్శనోత్కంఠ వాఁచు లేక
బరువుపొదుగుల మోయుచుఁ బర్వు లేక
వ్రజనిహితదృష్టు లై యిఁటే వచ్చుచుండె
ధేనువులు దీర్ఘశృంగసమాన్వితములు. —౨౮

రాము:—

మ. తమకై తల్లులు వేగవచ్చుటను వత్సల్ గాంచు లేయంగఁ బ్రే
మము మీఁఱంగని గోగణంబఱచి యంబాయంచుఁబాల్జేపునీ
యమలోద్యత్ప్రణయైకదృశ్యమిటులౌరా! యద్భుతం బేమిలా
భము నాసించునో పుత్రిమూలమున గోవర్గంబులోకమ్మునన్.

విశ్వా:—(ముందు చూచి) అదిగో! ఎవరో వృద్ధురా లగుగోపిక వేగముగా లేగలకుఁ బచ్చగడ్డి మోసికొనివచ్చుచున్నది.

[వృద్ధగోపిక ప్రవేశించును]

విశ్వా:—(చేరి) వృద్ధా! స్వస్తి.

వృద్ధ:—ఋషీ! దండాలు.

విశ్వా:—ఇంట నందఱును క్షేమమా?

వృద్ధ:—ఆ. మాబిడ్డలతండ్రి కోడలిని దీసికొనివచ్చుటకై గ్రామాంతర మేఁగియున్నాఁడు. పుత్త్రులు క్షేత్రసస్యములు రక్షించుచున్నారు. మనుమ లింటిపనులు చేయుచున్నారు. మీరు మాలోగిలికి వచ్చి పవిత్రము చేయుఁడు. ఈకుమారు లెవరు? ముద్దువచ్చుచున్నారు!

విశ్వా:—దశరథమహారాజుపుత్త్రులు.

వృద్ధ:—వీరిపేళ్లో?

విశ్వా:—(చూపి) ఇతఁడు రాముఁడు. పెద్దవాఁడు. ఇతఁడు

లక్ష్మణుఁడు.

రాము:—(చేరి) వృద్ధా! సూర్యకులజుఁడగు రాముఁడు నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును.)

లక్ష్మ:—(చేరి) వృద్ధా! రామానుజుఁడు నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించును)

వృద్ధ:—చిరంజీవులు కండు. (చూచి) ఏమి? ఇరువురును ధనుస్సులు ధరించినారు?

విశ్వా:—క్షత్త్రియులు నిత్యము ధనువులు ధరించి ధర్మరక్షణము చేయుదురు. వీరు దుష్టకారకులగు రాక్షసులను జంపినారు.

వృద్ధ:—ఈగ్రామవనముల మృగములనుమాత్రము చంపకుఁడు.

లక్ష్మ:—ఇవి మీకు సస్యహాని కలిగింపవా?

వృద్ధ:—ఐనను, చంపకు. బెదరులు విసరి మేము వారించుకొందుము.

లక్ష్మ:—నీ కపకారము చేయువానిపైఁ గూడ నీవక్షపాత మేల?

వృద్ధ:—ఈమృగములు సహవాసముచే మాచుట్టము లైనవి. అవి బెదరి పరుగులెత్తిన నెంతయుందముగా నుండునో!

విశ్వా—(రామునితో) వీరిద మూర్ద్రహృదయముఁ గనిపెట్టితివా? అపకారులయెడ నైన వీరు కోపింపరు. వారిగుణముల నుతింతురు.

రాము:—ఔను. నిజముగా వీరు దేవతుల్యులు.

విశ్వా:—వృద్ధా! పోయి రమ్ము. మేము సంధ్యవార్చి మీయింటికి వచ్చెదము.

వృద్ధ:—సరే. (నిష్క్రమించును)

విశ్వా:—వత్సలారా! మీ కీకృషీవలుల నేల చూపించితిని?

లక్ష్మ:—అల్పసంపన్ను లయ్యు వీ రత్యంతతృప్తమనస్కు లని.

రాము:—మాకు వ్యవహారజ్ఞానముకొఱకు. స్వయముగాఁ జూడకున్న చో వీరివ్యవహారనిర్ణయము చేయఁజాలము. నాగరకు లగుపౌరులు పాటవముచేఁ దమ పక్షము సాధించుకొందురు. నాగరకుల మగుమేము వీరివృత్తము స్వయముగాఁ జూడకున్న వ్యవహారనిర్ణయము కష్టతరము.

విశ్వా:—బాగుగాఁ జెప్పితిరి.

రామలక్ష్మణులు:—(విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా:—(తనలో) నేఁటికి వీరిని రావణుని యుద్ధములో జయింప సమర్థు లగునట్లు చేసితిని. వ్యవహారజ్ఞానము నలవఱచితిని. వీరు శ్రమచే డస్సియున్నారు. ఆవల దశరథుఁడు పుత్త్రవియోగమున దుఃఖించుచున్నాఁడు. ఇఁక వీరి నిలు చేర్పవలయును. జనకమహారాజు చేయుసాంవత్సరికసత్త్రయాగము నభినందింప నాహూతుఁడ నైతిని. సర్వగుణమనోహర, జనకపుత్త్రి, యగుసీత యీతని దేకదా! ఆతనికడఁ గలశివధనుస్సును రాముఁడు కాక యింకెవఁడు సజ్యము చేయఁగలఁడు? (ఆలోచించి) రాముఁడే సీతను బెండ్లాడితీరును. ఈరీతిని నేను దశరథునిఋణము తీర్చుకొందును.

రాము:—(నిరూపించి) భగవాను లేదో యాలోచించుచున్నట్లున్నారే?

విశ్వా:—ఔను. మనము విదేహాధిపునిఁ జూడ నేఁగవలసియున్నది. ఆయాత్త్రనుగూర్చి యాలోచించుచున్నాను.

రాము:—అక్కడను రాక్షసబాధ లేమైనఁ గలవా?

విశ్వా:—ఉన్నను, నీవు వచ్చినమాత్రమున నవి శాంతించును. జనకుఁడు సాంవత్సరికసత్ర మొనరించుచున్నాఁడు. సత్త్రాంతసమునభినందింప రండని నన్నాహ్వానించినాఁడు.

లక్ష్మ:—ఐన మేమును మీతోఁ రావలసియుండునా?

విశ్వా:—తప్పక. మీరాకవలన యజ్ఞసమాప్తి సఫలము కాఁగలదు.

లక్ష్మ:—మరల నయోధ్యకు మ మ్మెప్పుడు తీసికొని పోవుదురు?

విశ్వా:—ఆరాజర్షి యొక్క యజ్ఞఫల మనుభవించినపిదప.

రాము:—ఎట్లు?

విశ్వా:—అట కేఁగినతరువాత మీరే స్వయముగా ననుభవింతురు.

లక్ష్మ:—అట్లు కాని,

గీ. చేయఁబోయినకార్యసంసిద్ధి ముందు
తెలియ నుత్సాహ మది యత్యుదీర్ణ మగును;
ఫలము తెలియనికర్మంబుఁ జలుపు టన్న
మాంద్య మగుఁ గాదె ధరణిలో మానవులకు. 30

రాము:—వత్సా! ఫలము తెలియనికర్మ మందువేల? అట కేఁగినతరువాత ననుభవింతు రని భగవాను లన్నారు కదా!

విశ్వా:—ఫలస్వరూపము ఫలము లభించినపిదపనే తెలిసికొనఁ దగినది.

రాము:—అట్లేయగుఁగాక! భగవానుల యాదేశమునకు వివాదము కుండదు.

లక్ష్మ:—ఔను.

విశ్వా:—(తనలో) రామునకు సీత లభించుటతో నాయుద్దేశ మింతవఱకు సఫల మగును. రాముని శస్త్రవిద్య యొసంగుట లెస్స యైనది.

శా. కంటిన్ బ్రహ్మఋషిత్వ మీభువిఁ దపశ్శక్తింబునన్ నేన చే
కొంటిన్ జృంభకసాయకంబులు జగద్భీతిన్ నివారింపఁగా
నుంటిన్ శాంతిఁ దదస్త్రసంతతి మహాత్మంబైన రామునకు చే
కొంటన్; గష్టఫలంబు వ్యర్థమగుట న్గోరంతయుగా యెవ్వఁడున్.

(నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

---

ప్రవేశిక ii

[అంత ముగ్గురుభటులు ప్రవేశింతురు]

మొదటివాఁడు:—ముష్టికా! తపోవనమునుండి వచ్చిన విశ్వామిత్రులవారు కూర్చుండి యున్నారు. మనము వారి పాదసేవ చేయ నియోజితులము కదా! ఆమహర్షి యిచట నెన్నాళ్లుందురు?

రెండవవాఁడు:—ఓరీ! స్థూలాంసా! ఎన్నాళ్లుందురో యెఱుఁగను. ఆమునతో నున్నసుకుమారు లిరువురు రమణీయాకృతులు. విశ్వామిత్రసేవాపదేశమున నాసుమారుల నిరువురను జూచి దృష్టి సఫలము చేసికొంటిని.

మూఁడవవాఁడు:—ముష్టికా! వారు యువకులు. కుమారు లందు వేల?

ముష్టి:—దండకబాహయా ! వారిని "కుమారులారా" యని విశ్వామిత్రులు మహారాజును బిలుచుచుందురు. అందుచే నేను నట్లంటిని.

స్థూలాం:—జ్యేష్ఠుఁడగు రాముఁడు యౌవనవికారమునఁ జిక్కినాఁడు.

దండ:—ఇది యెట్లు తెలిసినది ?

స్థూలాం:—ఆతఁడు మహారాజకుమార్తెయగు సీత నుద్యానవనమునఁ జాలసేపు చూచినాఁడు.

ముష్టి:—లక్ష్మణుఁడు నీడవలె రాము ననుసరింప విశ్వామిత్రులేదో యుపదేశవ్యాజమున దూరమునకుఁ గొంపోయి రాము నొక్కనినే యుద్యానవనమున విడిచినారు.

స్థూలాం:—మనరాజకుమారియు నొడఁ జెట్టునెనుక దాఁగి రాముని జాలసేపే చూచినది.

ముష్టి:—రాజానుమతి యున్నవారికి వెంటనే పెండ్లి యగును.

దీర్ఘ:—కానినాఁడు వా రిరువురకుఁ బిచ్చియెత్తును.

ముష్టి:—ఇది మహారాజునకు విశ్వామిత్రునకుఁ దెలియునా ?

దీర్ఘ:—తెలియును. అందుచేతనే వారి నేకతమున విడిచి యుందురు.

స్థూలాం:—వారివివాహమహోత్సవము శీఘ్రమే చూచి జన్మము తరింపఁజేసికొందము.

దీర్ఘ:—(చూచి) ఓహో ! రాముఁ డిటే వచ్చుచున్నాఁడు. మనపని చూచుకొందము. (నిష్క్రమింతురు)

ఇది ప్రవేశిక.

# యజ్ఞఫలము

## షష్ఠాంకము

[మదనావస్థలో రాముఁడు ప్రవేశించును]

రాము:—(పరిక్రమించి దీర్ఘనిశ్వాసము విడిచి)

గీ. స్వచ్ఛసుందరశరదిందువదన నామె
నచటఁ గుసుమాపచయవేళ నరయు టాది
సర్వమును విస్మరించి నాస్వాంత మెప్పుడుఁ
దన్ముఖాంబుజదర్శనోత్కంఠఁ దనరు. ౧

ఆహా!

గీ. విధి జగన్మోహనార్థ మీవిద్రుమోష్ఠిఁ
జిరము యత్నము చేసి సృష్టించెనేమొ
కాక స్త్రీరూపనిర్మాణకౌశలమునఁ
గంతుఁడు సృజించెనో విధిగర్వ మడఁప. ౨

ఆహా! చిత్రము.

గీ. ఒక్కసారి కనుంగొని యున్నమాత్ర
మఱచిపోయితి సర్వమ్ము మతి కలంగ
నింక నొకమాఱు కనుఁగొన్న నేమి యగుదు
నో యెఱుంగను బళిర! మనోహరాంగి. 3

మఱియు,

మ. పరమానందముతోడ వత్సలతతో బాల్యంబునం దల్లి మ
త్పరమై స్తన్యమొసంగు టాదియెఱుఁగ న్నాపాదమున్నీడి నా

కరయ న్మానసలౌల్య మెన్నఁడును లే దారాక్షసశ్రేణి పెం
పఱఁ జేయ న్గలియింప; నాకిపుడు సంప్రాప్తించె నున్మత్తతల్.

యజ్ఞవిఘ్నకారులగు రాక్షసులను శస్త్రాస్త్రముల నాశముచేసి నాయాత్మశక్తి సుస్థిర మనువిశ్వాసముతో నుంటిని. అట్టినాయాత్మశక్తి యత్యల్ప మని యీసంఘటనమువలనఁ బరమేశ్వరుఁడు జ్ఞప్తి చేయుచున్నాఁడు. ఆహా! మరల నామెను జూచుకోరిక ప్రవృద్ధమై జ్వరమువలె నాదేహము నంతయుఁ దపింపఁ జేయుచు నిట్టియకార్యమునైనఁ జేయించుచున్నది. ఇదివఱకెన్నఁడును విశ్వామిత్రమహర్షి యనుజ్ఞ లేక యేకార్యమును జేసియెఱుఁగని నేను నేఁ డాయనయాజ్ఞ లేకయే దొంగవలె నిచ్చటికి వచ్చితిని. మహావనములయందు మహారణములయందు సర్వదా వన్నెడఁబాయక యాత్మవలె నుండులక్ష్మణునిఁగూడ విడిచి వచ్చితిని. లక్ష్మణునిఁ గాని గురువులను గాని యడుగ లేదు. ఇది న్యాయమా యన్యాయమా యని విచారణ లేదు. హృదయమప్రయత్నముగా నామెయందు బద్ధమైనది. విషయములకుఁ జలింపని యారాముఁడను నేనే? కానిమ్ము. విశ్వామిత్రులకు దూరమున నుండుట మంచిది కాదు. ఇఁక, సమీపమున కేఁగెదను. అవిజ్ఞాతకులాచారస్త్రీదర్శనప్రసంగమునుండి మనస్సును మరలించెదను. కాని,

గీ. ఈమెఁ జూడక యానందహీన మగును
  నా మన స్సది; ఇఁకపైని నేమి యయినఁ

బరమపావన పూర్ణనార్యచరిత మొల్లు
విడువఁ జాలుదుఁ గామప్రవృత్తిఁ దవిలి? ౫

(పరిక్రమించి) ఆహా! అనుగు పడుట లేదు.

సీ. ఒక్కయంతవ్యగ్రైన నిడఁజాల కున్నవాఁడఁ
గరము బంధింపఁబడెనేమొ చరణయుగళి
ఆమెఁ జూడక యీకన్నులార! రెండు
చూడఁ జాలక యున్నవి చోద్యముగను. ౬

సరే.

గీ. ఎవతెఁ జూచిన నామకహృదయ మొల్ల
నవిరళానందభరితమై యతిశయిల్లు
నామె నింకొక్కపరిఁ బ్రీతి నరసి నేత్ర
పర్వముగ నేఁగెదను గురువయ్యకడకు. ౭

(ఆలోచించి) ఇప్పు డామె రాకుండిన నెంతసే పాఁగుదును? సందిగ్ధఫలవిషయమున మతిమంతుఁడు శ్రమపడఁడు. ఇట నుండు టుచితము కాదు. ఏలన, మహర్షి బ్రహ్మచర్యనియమముల నెన్నిటినో యుపదేశించిరి. వానిలో మనోనిరోధము మొట్టమొదటిది. కాన,

గీ. బ్రహ్మచర్యవ్రతంబునఁ బరగురాముఁ
డరయఁ జాలఁడు స్త్రీముఖ మది నిజంబు
ఇట్టియేకాంతమున వసియించుటీరు
తగదు తగ దెన్నివిధములఁ దలఁచి కనిన. ౮

(వెళ్ళఁబోయి) ఇఁక, నేఁగెదను. (ముందు చూచి) ఓహో! నా నేత్రపద్మముల నానందసరసిలో నోలలాడించిన యాసుందరి యీతనుమూలమునఁ గూర్చుండి యున్నది.

ఇట్లనే యుండి యూంమెదర్శనసుఖ మనుభవించి పోయె దను. (పరిశీలించి) ఇది గాలిచేఁ గదలుమాధవీలత. ఛీ! ఇది న న్నంత మోసగించినది ? ఇంతకు నిది నామనో వికలతయే. ఔను. కాముకు లిట్లే మోహితు లగు చుందురు.

గీ. ఆత్మవైభవ మంతయు నవలఁ ద్రోచి
దేహ మొసఁగించి కామసందీపితముగ
ధైర్యవంతులశుద్ధచిత్తములనైనఁ
దమ కెసకుఁ ద్రిప్పుకొందురు తరుణు లౌర! ౯

(ఆలోచించి) అట్లను టుచితము కాదు. ఈదోష మామెది కాదు.

గీ. నడువఁగా లేదు గతిశోభ కడలుకొనఁగఁ
జూచి యెఱుఁగదు విభ్రమసూచకముగ
నెదుట నిల్వఁగ లే దామె యేల యిట్లు
వ్యర్థముగ నంటి నోటికి వచ్చినట్లు? ౧౦

మఱియు,

గీ. రాముముడి ధనుస్సుగాఁ జూపుములికి నాదు
మానసము లక్ష్యముగ నేసెనో నయనముసఁ
గాక మూఢుఁడ వ్యర్థమ్ముగాఁ దదీయ
రాగపాత్రుఁడ నని యనురాగి నైతి. ౧౧

ఏది యేమైన నగుఁగాక! నేను వృథా విచారశ్రమ మంద నేల? పోవుదును.

(తెరలో; "సఖీ! ఇటు. ఇటు."

రాము:—(విని, చూచి) కాదు. నామతిభ్రమ కాదు. సత్యము.

నానేత్రముల నమందానందము స్రవింప శారదచంద్ర ప్రభ లీను మొగముతో నామెయే మరణింప నున్న నన్ను బ్రదికించుటకు సఖులతో నిటే వచ్చుచున్నది.

గీ. నభముపై మేఘమును జూచి నాట్యమాడు
నెమిలిరీతిని నీవచ్చునిరుపమాన
సుందరీరత్నవదనారవిందముఁ గని
మన్మనము నాట్య మొనరించు మహితభంగి. ౧౨

[అంత సఖులతో సీత ప్రవేశించును]

ఒకసఖి:—భర్తృదారికా! ఈయుద్యానమున నెటఁ గూర్చుండి మనోవినోదముఁ గావించుకొందము?

మఱియొకసఖి:—ఆమాధవీలతదగ్గఱ. లేక, అశోకవృక్షపుసీడ.

సీత:—సఖీ! చంద్రకలా! భర్తృదారికా! యని క్రొత్తగాఁ బిలిచెద వేమే? ఇదివఱకెట్లనుదానవో యట్లే సీతా! యన వేమి?

చంద్ర:—నీ వట్లేల కనిపించుచుంటివి?

సీత:—మధురికా! నీ వట్లందు వేమే? నేను మీప్రియసఖి నగుసీతనే.

మధు:—నీవు మఱియొకవిధముగాఁ గనఁబడుచున్నావు. నీచాపల్య మెక్కడకుఁ బోయినది? భయముతో నున్నట్లు, నీకనులు వికసించుట లేదు. నీకన్నులయొఱుపు చూచిన, నిద్ర లేనిదానవువలెనున్నావు. ఏకాంతముగా నీయెదలో నేమనుకొంటివో తెలియుట లేదు.

చంద్ర:—ఇచ్చటికి వేగముగా నేల వచ్చితివో కూడఁ దెలియుట లేదు.

మధు:—నీలో యౌవనవికారము పుట్టియుండును. ఏయువకుఁడు నీబాహులతచేఁ గంఠము నలంకరించుకొని ధన్యుఁడు కాఁగలఁడో ?

సీత:—పోండు. మీ రిదే యాలోచించు చుందురు.

రాము:—ఈమె వికారమును నేను గ్రహించితిని. ఈమె యెవరో రాజపుత్త్రికయగుచో నాకగమ్య కాదు. అన్యవధు వైన నలభ్యయే. అట్లైన, నాహృదయ మీమెయం దుంచుట వ్యర్థమే యగును. (ఆలోచించి) అట్లై యుండదు. ఏలన,

గీ. పరవనిత యైన నీమె దుష్ప్రాప యైన
నామనస్సేట్లు పరుగెత్తు నీమెపైకి ?
మనసె కాద ! కృత్యాకృత్యమతివివేక
మునకు నుత్తమప్రామాణ్య మన ధరిత్రి? ౧౩

సీత:—ఏలొకో కాని నామనస్సీయుద్యానవనమున వెనుకటివలెఁ బ్రసన్న మగుట లేదు. శరీరమునకుఁ జాల సంతాపము కలుగుచున్నది. కదలనైనఁ గదలఁ జాలకున్నాను.

మధు:—ఆమణిశిలాతలమునఁ గూర్చున్నచో భర్తృదారికకుఁ గుసుమపరిమళముతో నుద్యానవాయువు వీచి స్వస్థతఁ జేకూర్పఁగలదు.

సీత:—ఔను. కూర్చుందము. (కూర్చుండి దీర్ఘముగా నిశ్వసించి) సఖి! నాశరీరసంతాప మధిక మగుచున్నది.

మధు:—(నళినీదళమున సీతకు విసరును)

రాము:—ఆమె శరీరసంతాపమున నేనును దహించుచున్నాను.

క. ఈరమ్యోద్యానసవా
వారిసుశీతలితభూమిభాగము, సుమన
స్సౌరభవాసితమలయస
మీరము, తాపంబుఁ గూర్చు నేన నిదేలా ? ౧౮
కారణ మేమై యుండును ? ఆ. తెలిసినది.

గీ. ఇరువురకు దేహ మేనియు హృదయ మేని
గలియ నొక్కనిధర్మ మొక్కనికి నమరు
నామనోవృత్తి సర్వము నాఁచికొన్న
యీమె తాపంబునం దపియించుచుంటి. ౧౯

సీత:—నా తాప మీచల్లనిగాలివలన శాంతింపదు. మీరు శ్రమ పడ వద్దు.

మధు:—(జనాంతికముగా) చంద్రకళా ! నే ననుకొన్న సంతాప కారణము నిజమే. ఇది శరీరసంతాపము కాదు. మన స్సంతాపమే.

చంద్ర:—ఐనచో, ఈవిషయ మూర్యుఁ డగు రాముని కేల నివే దింపవు ?

మధు:—(జనాంతికముగ) ఆర్యుఁడు రాముఁడు విశ్వామిత్రపర వశుఁడై దృఢవ్రతము నవలంబించి యున్నాఁడు. ఆతనిం బ్రసన్నుఁ జేయఁజాలము.

రాము:—ఈసంతాపమువలన నామెముఖము తెల్లనగుచున్నను మఱియొకనూతనశోభ నే యందుచున్నది. ఆశ్చర్యము !

గీ. దూరమునఁ జూచినంత సుధారసంబు
గురిసి నామానసము చల్లఁబఱచు నెవతె

ఆమెయే ఘోరతాపంబు నందె నేఁడు
విధివిధానము ధర నసంవేద్య మహార ! ౧౬

చంద్ర:-(జనాంతికముగా) మఱి యుపాయ మేమి? ప్రియసఖి భర్తృదారిక శోచనీయావస్థలోఁ బడిపోయినది.

మధు:-(జనాంతికముగనే) సరే. ధర్మవిరోధము కాని ప్రణయము పరిగణింపఁ దగినదే యని విశ్వామిత్రులమతమై యుండును. అందుచే నామహర్షి యీ రిరువురకు వివాహము జరిగినఁ బ్రసన్నుఁ డగును.

చంద్ర:-(జనాంతికముగా) ఉపాయారంభ మెట్లు చేయుదము?

సీత:-సఖులారా! ఎండ చాల బాధించుచున్నది.

మధు:-ప్రియసఖీ! సీతా! చెట్టునీడ నున్నావు. ఎండ యెక్కడిది?

సీత:-(లజ్జతో) ఇది నీడయా?

రాము:-గీ. చల్లనౌగాలిఁ బాదపచ్ఛాయమునను
గూరుచుండియు నీసుకుమారి మిగుల
ఘోరతాపవశమ్మునఁ గుందుచుండె
నేమి హేతువో? చిత్ర మయ్యెడిఁ దలంప. ౧౭

గీ. పురుషహృదయాంతరమ్ములఁ బోలె స్త్రీల
హృదయములఁ గూడ దుర్భరమదనతాప
మేల కలుగదు? (ఆలోచించి) తప్పక యీలతాంగి
యంగజార్దితయై తాప మందుచుండె. ౧౮

నేత్రానందదాయకుఁ డగు నేయుత్తమునికొఱకో యీమె విరహ మనుభవించుచున్నది. అతఁ డెంత ధన్యుఁడో! అన్యానురక్తను గామింపకుండుట ధర్మనియమము కాన

నే నీవిషయమునుండి మనస్సును మరలింతును.

గీ. ఏ సనాలోచితంబుగ నిటఁ జరించి
తెలివిలేమికి ఫలము నందితినిగాదె
వీరధర్మముల్ సుఖమును విడిచిపోవ
జీవితం బెల్ల దుఃఖసంస్పృష్ట మయ్యె. ౧౯

మధు:—(జనాంతికముగా) నేను స్పష్టముగాఁ బ్రియసఖి నడిగెదను.

చంద్ర:—(జనాంతికముగా) అడుగుము.

మధు:—ప్రియసఖీ! యీసంతాపము మదనసంతాపమువలెనే యున్నది. ఎప్పు డారాము నీయుద్యానవనమునఁ జూచితివో యప్పటినుండి నీసంతాప మారంభ మైనది. ప్రతిదినము వృద్ధి యగుచున్నది. ఇది నిజమైనఁ జెప్పు. ఏదో యుపాయము చూతము.

రాము:—(విని హర్షముతో) ఏమి! నేనే యీమెతాపకారణ మైతిని!

గీ. నన్నె మనసార వరియించుచున్న నీమె
యధికమదనార్తి సంతప్త యగును గాక
అట్లె నేనును దప్తుండ నగుదు మిగుల
హృదయమున నీమె యున్న నా కేమిబాధ? ౨౦

ఆహా!

గీ. స్వార్థబుద్ధులు మానవజాతకు లెందు
నన్యదుఃఖముల్ తో సుఖ మందు చుంద్రు
పరమదుస్సహ మీమెతాపమ్ముఁ జూచి
కులుకుచుంటిని సంతోషకలితుఁడ నయి. ౨౧

సీత:—నామనస్సున నిట్టివికార మున్న దని మీరాయిరువురకు నెట్లు తెలిసినది ?

మధు:—కానిచో నీసంతాపమున కింతకన్నఁ గారణ మేమై యుండును ?

సీత:—(సిగ్గుపడును)

రాము:—ఛీ ఛీ. కష్టము. నాగంధర్వనగరము విధ్వస్త మైనది. కామాకులబుద్ధులు, మూర్ఖులు, దీనులు, నగుమానవులు జగత్తుసందలిసర్వవ్యాపారములను, ఆత్మాశ్రయముగాఁ దలఁచి భ్రష్టు లగుదురు. కృతకృత్యు లగు విద్వాంసులు ధర్మయుక్త మగుకర్మ మొనరించి దాని ఫల మందినను నందకున్నను తృప్తివడసి సంతోషింతురు. వారు నిజముగా ధన్యులు.

మధు:—ఏకారణముననో తెలియని నీసంతాపమునకు నివారణోపాయ మెట్లు చూతుమమ్మా నీవు చెప్పనిచో ?

సీత:—చెలులారా ! మీరు చెప్పినకారణము నిజమే. మీతోఁ గాక యిఁక నెవ్వరితోఁ జెప్పుకొందును ?

రాము:—(సంతోషముతో) సంతోషము. దైవవిహిత మగు కార్యము సగము సిద్ధించినది. ఈమె యెవరికూఁతురో ?

మధు:—చెలీ ! వెంటనే యీవార్త మహారాజునకు, విశ్వామిత్రునకు, ఆర్యుఁ డగురామునకుఁ దెలుపుదము.

సీత:—(దీర్ఘముగా నిట్టూర్చి) ఒకపెద్దసంగతి మీరు మఱచితిరి.

మధు:—ఏ మది ?

చంద్ర:—నాకుఁ దెలియును. శివునివి ల్లెక్కిడినవానికే తన కూఁతు నిచ్చెద నని మహారాజు నిశ్చయించినాఁడు.

అది దుష్కర మగుటచే రాముని కది సాధ్యమా యని ప్రియసఖి జడియుచున్నది.

సీత:—(దీర్ఘముగా నిశ్వసించి) ఔను.

మధు:—రాముఁ డెంతసుందరుఁడో యంతబలవంతుఁ డైనను ధనుర్భంగము కావింపఁ జాలఁ డని నిశ్చయింతువా ?

సీత:—చాలనినాఁడు నేను జీవింప లేను. (మూర్ఛిల్లును)

చంద్ర:—దేవతలారా ! రక్షింపుఁడు. సీత మూర్ఛిల్లినది.

రాము:—(నవ్వుచుఁ జేరి) భయపడకుఁడు. నేను బ్రియురాలి... (అర్ధోక్తితో మౌనము వహించును)

మధు:—ఆర్యునకు స్వాగతము. ప్రియసఖి నెట్లు రక్షింపవల యునో యట్లు చేయుదురుగాక !

రాము:—అంతయు వింటిని. కాని, సందేహనివృత్తి కడిగెదను. ఈపుణ్యాత్మురాలితండ్రి యెవరు ?

చంద్ర:—బ్రహ్మజ్ఞాననిధి. జనకమహారాజు.

రాము:—(తనలో) ఏకులకన్యయో యనుకొంటిని. ఈమె మహా కులజ యగుక్షత్త్రియకన్య. నాకోఱకై యీమె పరిత పించుచున్నది. నాహృదయ మీమెయందు లగ్న మైనది. నాసుఖముకొఱకే విధి యీమెను సృష్టించి యున్నాఁడు. (ప్రకాశముగా) ఈమె సఫలమనోరథ కాఁ గలదు. నేను నీమెను జూడకున్నఁ బ్రపంచమును శూన్యముగాఁ దలంతును... (అర్ధోక్తితో విషాదము నటిం చుచుఁ దనలో) వివేకవినయాపేతుఁడనై మాటాడితినా ?

చంద్ర:—(తనలో) తెలియవలసినది తెలిసినది.

మధు:—మహారాజు మిగుల దుష్కర మగుపణ ముంచినాఁడు.

రాము:—అదియు నేను వినియే యున్నాను.

గీ. శివునిచాపంబు సజ్యంబు చేయ నొక్క
మానవప్రసిశక్తి కైనచో దాని కేనె
తగుదుఁ; బరాముసు రాజసుతావివాహ
రోధి యయ్యెనా? భాగ్యదూరులము మనము. —౨౨

మధు:— ఈమాట మాకు మిక్కిలిఁ బ్రియకరము. ఆర్యపుత్త్రా! ఈమహాకార్యమును సాధింపఁ బ్రతిన పట్టితివి. కాని, బాలుఁడ వగు నీవలన నిది సాధ్యమా యని మేము శంకించుచున్నాము.

చంద్ర:— తేజశ్శాలుర పరాక్రమమునకు వయోదేహము లపేక్షితములు కావు. సింహపోతము చిన్నదయ్యు మహాకాయము గలయేనుఁగును జంపును గదా!

(తెరలో) "మహారాజా! ఇటు. ఇటు."

రాము:—ఆహా! భగవానుఁడు (తనలో)

శా. రాజై యుండియుఁ గాంచె నెవ్వఁడు పవిత్రబ్రహ్మభావంబు; స
త్తేజం బొప్ప నెవండు పూనులకు నందించెన్ మహాజ్ఞాన; మా
భ్రాజిష్ణుండు నిరస్తకాముఁడు జగద్వంద్యుండు శాంతాత్ముఁడా
రాజర్షి ప్రవరుండు వచ్చునిట కారా! మందమందంబుగన్.

కావున నే నిచట నుండఁ దగదు. పోయెదను.

(నిష్క్రమించును)

సీత:—సఖులారా! ఇపు డేమి చేయుదము?

చంద్ర:—ఇపుడు క్రొత్తగాఁ జేయవలసిన దేమి? మహారాజు వచ్చుచున్నాఁడు. కావున నెదు రేఁగి నమస్కరింపుము.

సీత:—నాసంతాపవృత్తాంత మాయన వినలేదుకదా?

మధు:—నీ విట్లు శంకింపకుము. (నవ్వుచు) ఆయన విన్ననే నీసంతాపము పోవునుపాయము చూచును.

సీత:—నాకష్టసమయమున నన్నుఁ బరిహాసించుచున్నావా ?

మధు:—నీదుఃఖశాంతి యైనది.

సీత:—మరల వేళాకోళమా ?

మధు:—వేళాకోళము కాదు. విను. రాముఁడు కానరానిచో నీ వెంత సంతాపపడుచున్నావో నీవు కానరానిచో నాతఁడు నంతసంతాపమే యందుచున్నాఁడు.

సీత:—పోవే. ఆర్యపుత్త్రుని పేరేల తెచ్చెదవు ?

మధు:—ఆయన నీ కార్యపుత్త్రుఁడు. మాకు స్నేహితుఁడు.

సీత:—(కోపముతో) నీ కెట్లు తెలియును ?

మధు:—(చెవిలో) ఇట్లు.

సీత:—నిజమా ?

మధు:—నిజమే.

సీత:—పోవే. అసంబద్ధప్రలాపము లాడుచున్నావు. నీమాట వినను.

(తెరలో) "మహారాజా ! ఇటు. ఇటు."

చంద్ర:—మహారాజులు వచ్చినారు.

[అంత జనకుఁడు చేటులతోఁ బ్రవేశించును]

జన:— గీ. విమల మైయొప్పువిబుధుసవిద్య తగిన
ఛాత్రుని కొసంగినప్పుడే సఫల మగును
అటులె కని పెంచి నట్టికన్యాలలామ
యోగ్యున కొసంగి సుకృతియై యొప్పుఁ బితయు.

సీత:—(చేరి) తండ్రీ ! నమస్కారము. (నమస్కరించను)

జన:—వత్సా ! సర్వగుణనిధి యగుభర్తను బడయుదువుగాక !

పితృమాతృవంశములకుఁ గీర్తి నొసంగుదువుగాక !

సీత:—(కన్నీటితో) తండ్రి పెండ్లిచేసి నన్ను దేశాంతరము పంపి వేయున్న.

జన:—దేశాంతరమో. జన్మాంతరమో. ఏమైనను జీవికి స్వకృత్యము ననుసరించి పోవక తప్పదు. వెళ్ళినపిదప నెవరు బంధుజనులకు బాధ కలిగింపరో మఱి తాము దుర్గతి నందరో వారే ధన్యులు. అమ్మా ! ఎప్పటికైనను నీ వేఁగక తప్పదు. నీవిప్రయోగభావముచే దహించుట మాకును దప్పదు.

గీ. దుఃఖములు పాపరాశివి తోడరి వాని
ధైర్యసంతోషముల నైనఁ దగును గాని
కడుసుఖోదర్కము లగుదుఃఖములఁ దలఁచి
మనసు శోకాకులంబుగాఁ జనదు చేయ. —౨౫

సీత:—(కన్నీటితో) తండ్రివలె నేను ధైర్యవంతురాలను గాను.

జన:—అవసరమునుబట్టి నీకును ధైర్య మదియే వచ్చును. మగని ప్రేమవలన నీవు మమ్ము మఱతువు.

సీత:—అట్లనకుము.

గీ. ఎంతవఱకును సంస్కృతి యొసఁగు నాకు
నంతవఱకును నామనమందుఁ దండ్రి !
పరమపావనభవదీయపాదపద్మ
యుగళి నెన్నండు మఱవంగనోప నిజము. —౨౬

జన:—వత్సా ! మంచిది. అది న్యాయమే కాని, తప్పక కలుగనున్నవియోగమును గూర్చి చింతింపరాదు. రాఁబోవు దుఃఖమును స్మరింపకుండుట, కడచినదుఃఖమును మఱి

చుట యివి ప్రాజ్ఞలక్షణములు. అందుచే నీవు సఖులతో నేఁగి మేడముందుభాగమునఁ గలబుద్ధివర్ధనపీఠమునఁ గూర్చుండి మనస్సును వినోదపఱచుకొనుము. (చేటితో) నీవు విశ్వామిత్రభగవానులతో సంధ్యోపాసన మైన వెనుక నేను వచ్చి వారితోఁ గొండొకకార్యము నివేదింపఁ దలఁచితి నని విన్నవింపుము.

అందఱు:—చిత్తము. (జనకుఁడు తక్క నందఱు నిష్క్రమింతురు)

జన:—ఈవేళ కాఱవనాఁడు నాకు సత్రాంతస్నానము. అపుడొక్క విధానమున సీతను రాముని కిచ్చెదను. ఏలన, కుల మన్న

గీ. పరమవిఖ్యాతము రఘువరకులంబు
రాముఁడు బుధుండు క్షాత్త్రవిరాజమాన
సుగుణపుంజము సీతకుఁ దగినవరుఁడు
వలచె రాముని నామె నావత్స నతఁడు. —౭౭

ఇఁక, శాంభవధనురారోపణరూప మగుపణమునకు రాముఁడు నిలువఁగలవాఁడే యని విశ్వామిత్రమహర్షి చెప్పియే యుండెను. (ఆలోచించి) రాముఁడే యిది చేయలేనినాఁడు విశ్వామిత్రభార్గవరాములను దప్పించిన నిఁక నిందులకు సమర్థుఁ డెవఁడు? నాపణము మూఢఫలమును గాని నిష్ఫలమును గాని యెన్నఁడు నీయదు. భగవానుఁ డగుభార్గవరాముఁడు శాశ్వతబ్రహ్మచారి. విశ్వామిత్రుఁడు వనవాసి. నాపణము విని యెందఱో వీరులు విభ్రమముతో విచ్చేసి యది నిర్వహింపలేక సిగ్గుపడి నాయసంభావితపణ విధానకౌశలమును నిందించి

పోఁజొచ్చిరికదా! విశ్వామిత్రవచనమున విశ్వాస ముంచి నన్ను ధన్యునిఁగా దలఁచుకొనుచుంటిని. (పరిక్రమించి మరల నాలోచించి) నాపరమసఖుఁ డగుదశరథ మహారాజును బిలువనంపెదను. నాకోరిక పాటించి యాతఁడు తప్పక విచ్చేయును. రాణులతోడను, వసిష్ఠ భగవానులతోడను, కుమారమంత్రిభృత్యపరివారపుర స్సరముగా విచ్చేయు మనికోరుచు నిప్పుడే దశరథునికడకు దూతను బంపుదును. మఱియు,

గీ. ఏనృపులు వచ్చి యీవింటి నెత్తలేక
కడు నిరాశాత్ములై పోవఁగనిరో వారి
నందఱను బిల్వనంపెద నరుగుదెంచి
వార లీయుత్సవము చూడవలయు నాఁడు. ౭౦

మఱియు,

గీ. ఈపణము దుష్కరం బని యెవరు నన్ను
నింద చేసిరో వారువా రంద ఱరయఁ
గలరు రఘురాముశక్తిని; గాంచి మిగుల
సిగ్గుపడఁ గాంత్రు తమతమచేవఁ దెలిసి. ౭౧

ఇంకను,

మ. పరమస్నేహమయుండ్వౌతు స్దశరథున్భార్యాత్రయింబిల్చియీ
ధరణీజాతను దక్షుమారునకు మోదం బొప్పఁగా నిచ్చి యీ
వరదాంపత్యము నేత్రపర్వముగ సంభావించి ధన్యుండ నై
పరమానందము నందెదన్ విపుల మహాభారం బిటు ల్దీరఁగన్.

(నిష్క్రమింతురు)

ఇది షష్ఠాంకము.

# యజ్ఞఫలము

## సప్తమాంకము

[అంతఁ గూర్చుండి సదస్యులు, సభ్యులు, దశరథమహారాజు, కుమారులు, జనకమహారాజు, పరివారము, వసిష్ఠభగవానులు, విశ్వామిత్రుఁడు, శతానందుఁడు, మంత్రులు, రాణులు, పరిజనులు, రాజులు ప్రవేశింతురు.]

జన:—(లేచి)

గీ. తమము నడఁచెడిజ్ఞానతేజమును గాంచ
బ్రహ్మమయముగఁ దోఁచు సర్వంబు; ధర్మ
కర్మ మొనరించి లోకసౌఖ్యమ్ముకొఱకు
నాత్మవిజ్ఞత నెల్లరు నలరవలయు. ౧

గీ. కర్మపరము సమస్తంబు కాన దాని
విడువ శక్తుండు గాఁడెట్టివిజ్ఞుఁడైన
ధర్మయుక్తకర్మంబు నిత్యంబుఁ జేయు
సజ్జనుఁడు నిర్మలం బైనశాంతిఁ బడయు. ౨

గీ. తరణి యొక్కఁడె బహుజలాధారములను
వివిధరూపమ్ములను గానిపించునట్లు
ఒక్కటయ్యును నాత్మ తా నక్కజముగ
వివిధరీతుల మనలోన వెలయుచుండు. ౩

గీ. యజ్ఞ మొనరింపఁ దగు మానవాళి కెప్డు
సురలు యజ్ఞమ్మునను మెచ్చి వరము లిత్తు

రీశుఁ దనియించి దాన నభీప్సిత మగు
యజ్ఞఫలమును గాంతురు విజ్ఞు లవని. ౮

నా యజ్ఞము సమాప్తమైనది. ఆర్షవిధి ననుసరించి రఘుకులప్రదీపుఁ డగుదశరథమహారాజు జ్యేష్ఠపుత్రుఁడు, సకలక్షత్త్రికులకమలాహస్కరుఁడు, భుజబలోత్థాపిత భగ్నానేకమహాబలవీరావిచాలితోగ్రచాపుఁడు, భీమ యాతుధానవధనివారితతపోవనభయసంశయుఁడు, సుకృతిజనమనఃకుముద ప్రసాదహేతుభూతుఁడు, నగు రామచంద్రునకు భూజాత యగుసీత నిచ్చితిని. ఇంతకును, అనురక్తానురూపవరాభిలాషిణి యగునామె నిచ్చుటలో మాప్రభుత్వమే మున్నది? అపరిచ్ఛేద్య మగువారితుల్యగుణప్రీతి నభినందించితి నని మాత్రమే చెప్పవలసియున్నది. మఱియు, భరతలక్ష్మణశత్రుఘ్నులను గ్రమముగా నాయుష్మతు లగుమాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి వీరికిఁ దగినవరులనుగా భావించితిని. తుల్యగుణవంతులు, తుల్యరాజవంశసంబంధులు, నగు వీరివివాహములకు మీయందఱియనుమోదము నున్న నంద ఱొక్కసారి స్వస్తివాచకములు పల్కుఁడు.

అందఱు:—స్వస్తి. స్వస్తి. స్వస్తి.

(ఆకాశమునుండి పుష్పవర్షము కురియును.)

దశ:—(లేచి)

మ. వరరాజర్షులకుఙ్ గురుండు పరమబ్రహ్మర్షులఙ్ మేటి మ
త్పరమస్నేహహితుండు నాజనకభూపాలుండు వియ్యంకుఁడై

గురుసంప్రాప్తగుణశ్రుతాత్ములు సుతుల్ బ్రాంతిందులందూఁగు స
ద్వరసంజాతలఁ గన్యకామణుల నందన్ నాకు సంతోషహా.

వసి:—

మ. ప్రియశిష్యాగ్రగణిపుత్రరత్నములు సద్విద్యానవద్యుల్ వినీ
తియుతుల్ మత్సముపాత్తబోధనమహాధీయుక్తులున్ వీరలున్
నియతాస్త్రాగమకోవిదుల్ పరిణయోన్మేషంబు నందంగ న
వ్యయసంతోషమునందె నామనము బ్రహ్మానందతుల్యంబుగన్.

విశ్వా:—

చ. తగినసఖుండగున్ దశరథక్షితిపాలుఁడు శుద్ధకర్ముఁడ్డీ
సుగుణి విదేహభూపతి విశుద్ధమనస్కుతఁ గొల్చు నన్ను న
త్యగణితబుద్ధు లస్త్రవిదు లైనకుమారులు నాకు శిష్యు లి
ట్లగుట వివాహమియ్యదిముదంబుధిఁ దేల్చెనునన్ను మిక్కిలిన్.

శతా:—

చ. పరమవిశుద్ధవంశజులు భవ్యగుణాస్పదు లీవధూవరుల్
పరిణయశోభఁ జెన్నలర భవ్యసుఖం బది నాకుఁ గల్గె నీ
కరణిఁ జెలంగుబాంధవము కాంచనరత్నసమాగమంబు నాఁ
గరము సుఖప్రదం బగును గావుత! భూస్థలి నెల్లవారికిన్.

(తెరలో) "ఏమేమి? ఇంతమహాకార్యము నాకుఁ దెలియ
కుండఁగనే రాజులు చేసిరా?"

వసి:—ఓహో! పరశురామభగవానులు భ్రూభంగమున భువన
భయంకరముగా నిటు వచ్చుచున్నారు.

(అందఱు లేచి నతశిరస్కులై నమస్కరింతురు)

**రాము:**—(లేచి) భయపడకుఁడు. భయపడకుఁడు.

గీ. శస్త్రమూలంబుననో మహాశాపముననొ
ప్రబలకోపంబుతోఁ జంప వచ్చునట్టి
విప్రులు ప్రణామమున భక్తి వినయములను
శాంతు లగుదురు మిక్కిలి క్షణములోన.

[క్రోధవంతునివలెఁ బరశురాముఁడు ప్రవేశించును]

పర:—(ఎవరిని జూడనట్లు నటించి)

మ. అలఘుబ్రహ్మవిఘాతదర్శితబలాహంకారులన్, వైదికో
క్తులఁ బాటింపనిమూర్ఖులన్, బ్రజల నాక్రోశింపఁగాఁ జేయునా
ఖలరాజన్యులఁ, జంపి తద్రుధిర మాకంఠంబుగాఁ గ్రోలు నీ
ప్రళయోద్యజ్జ్వలనోపమం బగుకుఠారం బుగ్రరూపంబునన్.

గీ. ధర్మపరులైనవిప్రులఁ దనుపుచుండు
రెవ్వరెవ్వరు స్వప్రజాహితు లగుదురు
వారి కెల్లర కభయంబు వలుల నాదు
బలము రక్షించు నెల్లవేళల నిజంబు.

(అందఱను జూచి తనలో) ఏమిది? నిరపరాధులు, ధర్మ
రక్షాధురీణులు వసుజనకాదులు కూడ నన్నుఁ జూచి
భయపడుచున్నారే.

వసి:—భగవానుఁడా! నమస్కారము. (నమస్కరించును)

పర:—వసిష్ఠభగవానుఁడా! ప్రతినమస్కారము. (నమస్కరించును)

విశ్వా:—కౌశికుఁ డగువిశ్వామిత్రుఁడు నమస్కరించుచున్నాఁడు.
(నమస్కరించును)

పర:—నీబ్రహ్మత్వము శాశ్వతముగా విరాజిల్లుఁగాక!

జన:—విదేహాధిపతి జనకుఁడు నమస్కరించుచున్నాఁడు.
(నమస్కరించును.)

పర:— గీ. గురువ నైతి మహార్షులకును మహాత్మ !
యష్టవు వదాన్యమణివి మహారథుఁడవు
నావలన నేమి వాంఛింతు వో వివేకి ?
ఆర్యబహుమానమిత్రంబ వగుదుఁగాక !

దశ:—సావిత్రుఁ డగుదశరథుఁడు నమస్కరించుచున్నాఁడు.

(నమస్కరించును)

పర:—నీపుత్త్రులు శాశ్వతయశ మొందుదురుగాక !

రామభరతలక్ష్మణశత్రుఘ్నులు:—భగవంతుఁడా! నమస్కారము.

(సగోత్రనామపురస్సరముగా నమస్కరింతురు)

పర:—వత్సలారా ! దీర్ఘాయుష్కులు, పుణ్యాయశస్కులు, నౌదురుగాక !

ఇతరులు:—(పరశురామునికి నమస్కరించి యాశీర్వచనము లందుదురు)

పర:—(జనకునితో)

గీ. రామబలమున శివధనుర్భంగ మయ్యె
నని విని తపంబు విడిచి నే నరుగుదెంచి
నాఁడ వేగంబునం జెల్వ నా క దెల్లు ?
కేసరినిసుంగు గిరిఁ బెల్లగింపఁ గనెనె ?

జన:—(బెదరుతో) భగవానుఁడా ! శివధనువును సజ్య మొనరించినవానికి సీత నిచ్చెద నని పణ మేర్పఱిచితిని.

పర:—అది నాకుఁ దెలియును. తరువాత ?

జన:—ఆయుష్మంతుఁ డగురాముఁ డాధనువు నెత్తఁగనే యది భగ్నమయ్యెను.

పర:—(రామునితో) ఇది నిజమా ?

రాము:—భగవానుఁడా ! నాబాల్యచాపల్యము క్షమింపుఁడు.

పర:—ఏ బాల్యచాపల్యము ?

రాము:—క. చిరముగ ననాతతం బయి
ధరణిపుకడఁ బ్రాఁతవడినధనువును బూన్కిన్
గరమునఁ బట్టినయంత నె
చెరిసగమై పడియె నేమి చేయుదు ? దేవా !

పర:—అయిన నిదిగో. ఈధనుస్సును సజ్యము చేయుము.
(ఇచ్చును.)

రాము:—భగవానునియాజ్ఞ. (గ్రహించి సజ్యము చేయును)

పర:—కూర్చుండుము. నీవైష్ణవ మగురూపమును గాంచఁ
గంటిని. (తనలో) ఆహా ! నాకోరిక సిద్ధించినది.

మ. ఖలులై పాపులునై యధర్మరతులై గర్వాంధులై మన్నమూ
ర్ఖుల నొక్కమ్మడి దైవయోగమున నిర్మూలించుభారంబు నీ
యిల నావెన్కభరించు నెవ్వఁ డని యెంతేఁ జింతతో నుంటిని
చ్చలుఁ జిత్తమ్మున వేగిరించెను తపశ్చర్యారతిన్ వీడుచున్.

కాని,

గీ. అవని హరియంశమునఁ బుట్టినట్టివాఁడు
రామచంద్రుఁడు ధర్మసేవామహితుఁడు
నే నొనర్పక విడిచిననిఖిలదుష్ట
మర్దనం బొనరించి క్షేమంబుఁ గాంచు.

(ప్రకాశముగా) వత్సా ! దాశరథీ ! నీవు వైకుంఠవాసి
వగు దేవదేవుఁడవు. తపోవనముల నీవు రాక్షసుల వధిం
చినవృత్తాంతము విన్నప్పుడే పురుషోత్తముఁడవు రామ
రూపమున జన్మించితి వని గ్రహించితిని. ఇప్పుడు స్వయ
ముగాఁ జూచితిని. అందుచే సప్రమాణముగా నాధనువు

నీ కర్పించితిని.

క. పాపులఁ బరిమార్చుటకే
చేపట్టుము నీవు దీని క్షితి ధర్మాత్ముల్
ప్రాపించి శరణుచొచ్చిన
నేపగిదిని వారిఁ గాచి యొసఁగుము రామా !

రాము:—దేవా ! అట్లే చేయుదును.

పర:—ధర్మమార్గమున నే నేయేలోకముల జయించితినో వానిని సభ్యుల కిచ్చి తత్త్వజ్ఞుఁడనై నే నేఁగుచున్నాను.

వసి:—భగవానుఁడా ! పుణ్యార్జితములైనలోకములు నీ వేల విడిచెదవు ?

పర:— గీ. కాలవశమునఁ బుణ్యంబు క్షయము కాఁగ
సారహీనంబు లౌ నెట్టిసంపదలును
వానిపై నుండ దావంత యైన నాస్థ
కాన నేను త్యజింతు లోకమ్ము లెల్ల.

గీ. అగుఁ జిదానందమయ మైనయట్టిబ్రహ్మ
మరయ శాశ్వత మది పరావరము దాని
యందు నిత్యస్థితియె మహానంద మొసఁగు
నందె నేను బ్రహ్మానంద మందుచుందు.

విదూ:—(తనలో) ఈముసలియెలుఁగుబంటి త్వరగాఁ బోయిన మేలు.

పర:—నే నేఁగివచ్చెదను. (శీఘ్రముగా నిష్క్రమించును)

జన:—ఆహా ! జామదగ్న్యుఁ డమితబలశాలికదా ! ఈతఁ డెంతపరమశాంతుఁ డయ్యెను ! ఇఁక, క్షత్రియులు సుఖులై యుందురు.

రాము:—పరశురాముఁ డాదేశించినప్రకారముఁక నేను బాపనాశన ముపేక్షింపను. పాపు లెల్లరికిఁ బలాయమాననిద్రములు, కంపమానమనస్కులు నౌదురుగాక !

దశ:—పరశురామభగవానులు సర్వతేజోనిరాకరిష్ణు వగుబ్రహ్మత్వమున నొప్పినారు.

విదూ:—(తనలో) ఆవృద్ధబ్రుక్షము వెడలిపోయినపిదపఁగూడ వీరంద ఱాతనిని స్తుతించుచున్నారు.

విశ్వా:—కాదు. ఆతనిపరాక్రమమున బహుక్షత్రియులు మరణించినారు. కావున, నాతనిబ్రహ్మత్వము మహత్త్వమందలేకపోయినది. భగవానుఁ డగువసిష్ఠునిబ్రహ్మత్వమొక్కటియే ప్రశంసింపఁదగినది. అది నావంటివానిని సైతము తదేకకాంక్షచే సర్వసంగపరిత్యాగి నొనరించినది. మఱియు వసిష్ఠునిబ్రహ్మత్వము హింసింపకయే యితరము లగుతేజస్సులను నిరాకరించును.

వసి:—ఈప్రసంగము తలఁచినదానికి భిన్నముగా వచ్చినది.

విశ్వా:—(పైకిఁ జూచి) దివ్యాభినందనము స్వీకరించుటకు సపత్నీకులై దశరథకులప్రదీపులు కుమారులమధ్యమునఁ గూర్చుందురుగాక !

వసి:—ఏరీ దివ్యులు ?

విశ్వా:—అదిగో. అందఱు పైకిఁ జూడుఁడు.

అందఱు:—(పైకిఁ జూచెదరు)

విశ్వా:—

చ. నలువయు విష్ణువు న్శివుఁడు నారదతుంబురులింద్రుఁడుంగుతూ
హాలు లయి కల్పవృక్షకుసుమావళిఁ జల్లుచు మంగళార్థమై

యలఘుతరంబుగా జయజయారభటులం బచరించుచుండ్రి ని స్తులబహువాద్యఘోషములతో నవదంపతు లుల్లసిల్లఁగన్.

దశరథజనకులు:—(చూచి) నిజము నిజము.

[అంత నలువురువధువులు సపరివారముగాఁ బ్రవేశించి నలు పురువరులప్రక్క నిలిచియుందురు. దివ్యవాద్యఘోషములతో నాకసమునుండి పుష్పవృష్టి కురియును.]

అందఱు:—స్వస్తి. స్వస్తి. స్వస్తి.

విశ్వా:—సఖా! దశరథా! నీ కింక నేమిప్రియము కావల యునో కోరుకొనుము.

దశ:—దేవా!

గీ. పుత్రహీనదుఃఖం బడి పోయె నెపుడొ;
యిపుడు జనకాత్మజలు స్నుష లిట్టు లైరి;
పీరు లయి ప్రీతిమంతులై వెలయుచుండి
రాత్మజులు నాకు నింకఁ గామ్యంబుఁ గలదె?

విశ్వా:—ఐన నిట్లగుఁగాక! రాజసింహుఁడ వగునీవు పాలింప

క. వర్ణాశ్రమధర్మంబులు
పూర్ణంబుగ వెలయఁ బ్రజలు పొందఁగ బహుసం
పూర్ణాయుస్సుఖములు నిఖి
లార్ణవపర్యంతభూమి యలరుత శాంతిన్.

వసి:—తథాస్తు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది సప్తమాంకము.

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 21 | తలలో | తనలో |
| ,, | 23 | గీ. | కై కే:—గీ. |
| 24 | 4 | గుణాముల | గుణముల |
| 38 | 6 | పరమాశ్చర్యంబు | పరమాహ్లాదంబు |
| 56 | 16 | అనద్యం | అనవద్యం |
| 58 | 1 | దైతత్వ | దైవత్వ |
| 64 | 16 | కుశలురై | కుశలులై |
| 68 | 22 | చిగురించు | చిగిరించు |
| 70 | 5 | నొంటి నేకరణి | నెట్టు లేవంపు |
| 93 | 3 | స్త్రాంతనము | స్త్రాంతమున |
| 114 | 5 | మహీం | మహాం |



